

ఉమ్మడిసెట్టి వేంకటస్వామి నాయుడు,

గ్రంథకర్త-ఫిడేలు వాయించుచున్నవారు.

శ్రీ

# సంగీతవిద్యాదర్పణము.

అనునీగ్రంథము

సంగీతవిద్యార్థుల యుపయోగార్థము

శ్రీ లక్ష్మీనృసింహ చరణారవింద సేవాపరాయణుం డగు

ఉమ్మడిసెట్టి-వేంకటస్వామి నాయనిచే

రచియింపఁబడి

మచిలీపట్నము

సేతు ముద్రాక్షరశాలయందు సి. సేతుమాధవరావుచే ముద్రింపించి

ప్రచురింపఁబడియె.



1910.



దీని వెల ప్రతి 1కి రు 2-0-0 లు.

# పీఠిక.

—⁂—

అఖిలజనహృదయానందకరంబగు సంగీత విద్య ఇద్దేశంబున వేద ప్రసిద్ధంబై భారద్వాజ, నారద, వసిష్ఠ, శార్ఙ్గదేవ, దత్తిల, గౌతమ, చ్యవన, శాండిల్య, కుమార, ఆంజనేయ, శుక్ర, కోహళాది మహామహులచే వృద్ధినొందింపబడి, భగవన్నామసంకీర్తన జేయునపుడును, రాజసన్నిధానంబుల యందును, వివాహ ప్రముఖ మహోత్సవములందును, ఉపయుక్తంబై ధర్మార్థకామ మోక్షములనెడి చతుర్విధ పురుషార్థ ప్రదాయకంబై యుండియు, తదభిమానులైన మన దేశపు ప్రభువుల దొరతనము గతించిన వెనుక మనవారిలో గాన శాస్త్రజ్ఞులకు నంతగా విశేష సన్మానము లేకపోవుటచే నానాట క్షీణదశం జెందుచున్న నీ గానవిద్యను సంప్రదాయ యుక్తముగ మరల వృద్ధి నొందిన బాగుగ నుండునని యూహించి, సంగీత శాస్త్ర ప్రవీణులచే బరిష్కరింపఁబడిన సంగీత రత్నాకరము, స్వర రాగసుధారసము, నారదీయ రత్నాకరము, సోమనాథీయము, స్వర మేళకళానిధి, సంకలితరత్నాకరము, రాగమంజూష, శ్రుతి రంజని మొదలగు గ్రంథములను మిగుల పరిశోధించి, సంప్రదాయపూర్వకముగ గానవిద్య నభ్యసించుటకు తగిన గ్రంథసాధనము లావశ్యకములగుటంజేసి క్రమశిక్షావిద్యార్థులకు మిగుల నుపయుక్తంబగునట్లు నవీనముగా "సంగీత విద్యాదర్పణము" అను పేరిట నీ గ్రంథమును బ్రచురింపఁదలచితి. ఈగానవిద్యకు ప్రథమమున స్వరావళి ప్రాముఖ్యమని గాన విద్యా విశారదులగు మహనీయులందరు నొక్కివక్కాణించియున్నారు. పూర్వులవలన నేర్పరచఁబడియున్న స్వరావళి వరుసలు మొదటినుండి అలంకారముల వరకు ఒక్క రాగము నందే జంత్రగాత్రాదులయందు నభ్యసించుటవల్ల అట్టి ఒక్క రాగము యొక్క స్థానములే అలవాటుగలవారై పిదప ఇతర రాగముల లోనుండు గీతములు, వర్ణములు మొదలగునవి నభ్యసించునపుడు ఆయారాగములయొక్క స్వరస్థానములను జంత్రగాత్రముల యందు సులభముగా పట్టు బడక నేర్చుకొను వారికి కష్టతరముగా దోచి రాదనే తలంపుతో గీతప్రారంభములోనే విడిచి పెట్టుచుందురు. ఏశాస్త్రముల నైనను నభ్యసించు వారలకు పోనుపోను మిక్కిలి అభిరుచిగలిగే మార్గములను బోధపరచ వలెనే గాని నభ్యసించిన తొలది కష్టతరముగా నుండెడి మార్గములను జెప్పుట వలన త్వరలో వృద్ధి బొందకుండుటకు కార

ణమగుచున్నది. కావున, ఈ సంగీతవిద్య నభ్యసించువారలకు నట్టికొరత నివారింపఁ బూని స్వరావళి మొదలు అలంకారముల నభ్యసించే వఱకు అన్నిరాగముల యొక్క స్వరస్థానములను దెలియునటుల నవీనముగా స్వరావళి మొదలగునవి కొన్నిరాగముల లో నేర్పఱచి వ్రాయుటయ్యెను. ఇట్లేర్పరచుట వలన ముందు రాబోవు గీతములు, వర్ణములు, స్వరజతులు, కృతులు మొదలగు పాటలకుగల రాగముల యొక్క స్వర స్థానములను దెలిసి తమకై తామే బాడుకొనుట కనుకూలమగుచున్నది. మఱియు, ఫిడిలు మొదలగుజంత్రములయందు తమకై తామే శ్రుతిజేసికొని శుద్ధవికృతిభేద ములగు స్వరస్థానములను తమకై తామే గుఱుతులు పెట్టుకొని వాయించుకొనునటుల వాటికొలతలను సహా తేటబరచి వ్రాయబడి యున్నవి. అలంకారములు నాయాతా ళములయందు సరిపడునట్లు పాడవలసిన విధంబును, మంద్ర మధ్యమ స్థాన భేదంబు లును, ద్వావింశతిశ్రుతిజాతిలక్షణంబును, రాగప్రస్తారంబును, ప్రకృతివికృతి భేదములచే గలిగిన డెబ్బదిరెండు మేళకర్తలును, ఈ మేళకర్తలవలన బుట్టిన ననేకజన్యరాగంబు లును, రాగరూప మేర్పడునట్టి న్యాసాంశ గ్రహాలక్షణంబును, మిశ్రరాగముల యొక్క లక్షణంబును, ఆయారాగములకుగల మూర్ఛనలును, తాళవ్యుత్పత్తియు, ధృవాది సప్తతాళముల లక్షణంబును, తాళజాతులును, జాతులచేగలిగిన ముప్పది యైదుతాళంబులును, దశప్రాణ లక్షణంబును, నూటొక్కతాళముల లక్షణలక్ష్యం బును, ఇంకా ననేకవిషయములంజేర్చి ఇతరగ్రంధాపేక్ష లేకుండునట్లు స్పష్టముగా నిందు దెలుపబడియున్నవి. మఱియు, నీగ్రంధమునందుండు స్వరావళి మొదలు తానవర్ణములు, కృతులు, మొదలగువాట్లయొక్క స్వరములయందు రెండక్షరములుగల దీర్ఘాక్షరము తరుచుగా కొన్నిచోట్ల రెంటికటె నధికమగు యక్షరములు గలదగుచుం డుటచే నట్టి యక్షరకాలము దెలిసికొనుటకు (,) ఈగుఱుతు దీర్ఘాక్షరములకు ప్రక్క వ్రాయబడి యుండునుగాన (,) ఇవి యెన్ని యుండిన నన్ని యక్షర ముల కాలమని యెఱుంగునది. మఱియు, లఘుద్రుతము లేర్పరచిన చోట్ల యందు దీర్ఘాక్షరమునకు మధ్యఘాత వచ్చినయెడల ఘాతకు యెడమ వైపున హ్రస్వముగాను, ఘాతపడవలయుచోట (,) ఈగుఱుతును వ్రాయబడి యుండును. అదెట్లనిన ? (సా) యనుదీర్ఘాక్షరమునకు మధ్యఘాత వచ్చినపుడు దానిని స।, ఇటుల నిలువుగీటుకు యెడమవైపున ఒక యక్షరమును, నిలువుగీటుకు కుడివైపున పైనుదహరించిన గుఱుతును వ్రాసియుండునుగాన, దానిని దీర్ఘాక్షరము

గానే పాడుకొనవలయును. పదవర్ణములు, ఆదితాళతానవర్ణములు, అటతాళతానవర్ణములు, స్వరజతులు, త్యాగయ్యగారి కృతులు, దీక్షితులవారి కృతులు, శ్యామాశాస్త్రులవారి కృతులు, పట్నం సుబ్రహ్మణ్యయ్యగారి కృతులు, సదాశివరావుగారి కృతులు, వీణ కుప్పయ్యగారి కృతులు, మొదలగునవి తాళమునకు సరిపడునట్లు లఘుద్రుతము లేర్పరుపబడి మంద్రమధ్యస్థానములకును, కాలపై కాలసంగతులకును, వఱయికు పట్టవలసిన స్వరములకును గుఱుతులు వేయబడి సులభముగా దెలియునట్టుల వ్రాయబడియున్నవి. మఱియు, నీగ్రంథంబునందు అనేక విషయములు సంగీత విద్యార్థుల కత్యంతోపయుక్తంబుగ నుండునని నొక్కి వక్కాణించుట కేమాత్రియు సందియంబిందుగలుగ నేరదు. ఈ గ్రంథనిర్మాణంబున పెక్కు శ్రమగలిగినను, సర్వజనోపయుక్తంబు కర్తవ్యంబుగ నెంచి పూనుకొంటినిగాన, పర్వతంబులెల్ల నొక్క పర్వణంబున గాన్పించినరీతి స్వరరాగతాళాదుల లక్షణలక్ష్యంబులెంతయు దీనిం జూచువారికి కరతలామలకంబుగా నుండునటుల మిగుల తనుధనవ్యయప్రయాసలకోర్చి నీగ్రంథంబు సమకూర్చితిగాన, గుణగ్రహణ పారీణధురీణులగు సీచతురు లెంతయు నీరంబు త్యజించి క్షీరంబుగొను మరాళరాజంబు మాడ్కి గుణగ్రహణంబు గావించి నన్నానందింపఁ జేయుదురని నెమ్మనంబున ధృవంబుగ నమ్ముచున్నాడ.

ఇట్లు

గ్రంథకర్త,

విద్వజ్జనవిధేయుడు,

ఉమ్మడిసెట్టి వేంకటస్వామినాయుడు,

గుంటూరు.

# ✱ విషయసూచిక ✱

——:o:——

☞ ఈ గ్రంథమును వలయువారు గుంటూరు అరండల్ పేట నివాసులగు మహారాజశ్రీ తోట రామయ్యగారి పేర వ్రాసి తె ప్పించుకొనవలెను.

శ్రీరస్తు

# సంగీతవిద్యాదర్పణము.



ఉ. శ్రీరమాయంకపీఠమునఁ జెన్నలరారెడు వాఁడు భక్తవం
ఛారుఁడు హేమకశ్యపవిదారుఁ డతీతుఁ డనంతుఁ డాఢ్యుఁడున్
నారదమౌనిసంస్తుతుఁ డనాథసురక్షణుఁ డాదిదేవుఁడున్
ధారుణినారసింహుఁడు ముదంబు దలిర్పఁగ నన్నుఁ బ్రోవుతన్.

గీ. వెలయు సంగీత సాహిత్య విద్యలెలమి
కుచములే యింతికియ్యలఁ గొమరుమిగుల
నట్టిపలుకులదేవి యయ్యభవురాణి
వదలక యొసంగు గాత వాగ్వైభవంబు.

క. పాయని భక్తిని దలఁతున్
తోయధి గోష్పదమురీతి దాఁటుచుజని య
త్యాయత బలులన్ ద్రుంచిన
వాయుసుతున్ విమతవర్గ వైవస్వంతున్.

చ. గరిమ భజింతు నెమ్మదిని గానకళా పరిపూర్ణపూర్ణులన్
భరతుని నందికేశ్వరుని భర్గుని నారదు నత్రి వామనున్
సురగురు శుక్రుఁ గోహలుని సోమమరుత్తుని యాజ్ఞవల్క్యతుం
బురుమును భృంగి గౌతముని భోజపతిన్ హరుకశ్యపాదులన్
నరయ వసిష్ఠదత్తిలు వినాయక షణ్ముఖ శార్ఙ్గదేవులన్.

సీ. చతురగాన ఫణీంద్రు జయదేవు మదినెంచి
తీర్థుల వాగ్ఝరి తేటమెచ్చి
క్షేత్రజ్ఞ గాయక శ్రేష్ఠునిస్తుతియించి
ఘను పురంధరులను వినుతిజేసి

రామదాసాదుల రమ్యంబు గొనియాడి
నరిమ దీక్షితుల జ్ఞానంబు బొగడి
గురుమూర్తి శాస్త్రుల కోర్కెపై భజియించి
శ్యామకృష్ణాభిఖ్యు సంస్తుతించి
భూలోకనారదుఁబోలి పొగడొందిన
త్యాగరాజునకు వందన మొనర్చి

౪. వీణెకుప్పార్య సాంబాది విబుధవరుల
నమిత విధముల గీర్తించి నయముమీఱ
సకలసజ్జను లౌనని సంతసింప
ధరరచించెద సంగీత దర్పణంబు.

౫. తాళ లయ స్వరజాతుల
మాళిమెఱుంగక యె తెలియు మనుజులవలె నే
వేళను సభ జరియించెడి
కూళల కేగతిని సుఖము గొనసాగునొకో.

౬. తామురచియింప సుంతయు దరముగాక
సుగుణులెవరేని రచియింప సొంపుజెరచి
తప్పులని తాము దెలియక యొప్పిదముల
నుడువునధమాధముల నెంచఁబుడమి జను నే.

౭. అరయ జలరాశియందలి నెరసులణచి
మణిగణంబుల గాంచునామహితు పగిది
తప్పులెల్లను విడనాడి యొప్పిదములె
గొనెడి విబుధాళి నెంతయుఁగోరితలఁతు.

౮. వరునకు నబ్ధి కుమారీ
వరునకు నాశ్రిత జనప్రపంచనవ శ్రీ
కరునకు భయ హరునకు సుఁ
దరునకు శ్రీరామచంద్ర ధరణీశునకున్.

౯. వసుర్వ్ణాంబుగా [illegible] సంగీతవిద్యాదర్పణము [illegible]
శాస్త్రీయంబుగ [illegible] సంగీత [illegible] బెట్టినిద.



ఓం

శ్రీ ర స్తు.

# సంగీతవిద్యాదర్పణము.

## 1. సంగీతోత్పత్తి.

శ్లో. ఓంకారంచపరబ్రహ్మ యస్మాదోంకారసంభవ.
అకారోకారమాకార ఏతేసంగీతసంభవాః॥

శ్లో. అకారోవిష్ణురూపంచ ఉకారోబ్రహ్మరూపకం
మకారోభర్గరూపంచ సర్వమోంకారరూపకం॥

భా. ఓంకారము పరబ్రహ్మస్వరూపము. ఆ ఓంకారమునందే యావజ్జగత్తు పుట్టెను. అందులో అకార, ఉకార, మకారములనే మూడక్షరములవలన సంగీతము పుట్టెనని భావము* అందు అకారము విష్ణుస్వరూపమనియు, ఉకారము బ్రహ్మస్వరూపమనియు, మకారము రుద్రస్వరూపమనియు, ఈ త్రిమూర్తుల స్వరూపమే ఓంకారమని యర్థము.

## 2. సంగీత విభాగము.

శ్లో. మార్గదేశీవిభాగేన సంగీతంద్వివిధంమతమ్
ద్రుహిణేనయదుద్దిష్టం యదుక్తంభరతేనచ॥

శ్లో. తత్తద్దేశీయయాసంగీత్యా యత్స్యాల్లోకానురంజనమ్
దేశేదేశేనుసంగీతం తద్దేశీత్యభిధీయతే॥

తా. సంగీతము, మార్గమని, దేశియని, రెండువిధములు. అందు, మార్గమనగా ఈశ్వర ప్రణీతమై భరతఋషిచే ప్రకటింపబడిన సంగీతము మార్గమనంబడును. దేశిఅనగా, ఆయాదేశ సంబంధమగు రీతిచే, ఆయాదేశపు జనులను రంజించు సంగీతముదేశి అనంబడును.

## 3. సంగీత శబ్దార్థము.

శ్లో. గీతవాదిత్యనృత్యానాం త్రయంసంగీతముచ్యతే॥

తా. గీత, వాద్య, నృత్యముల చేరికయే సంగీతమనంబడును.

అన్యశ్చ. రాగస్వరశ్చతాళశ్చ త్రిభిఃసంగీతముచ్యతే॥

తా. రాగము, స్వరము, తాళములనే మూటిచేరికయు సంగీత మనంబడును.

## 4. సంగీతఫలితార్థం.

శ్లో. త్రివర్గఫలదాస్సర్వే దానయజ్ఞజపాదయః
ఏకంసంగీతవిజ్ఞానం చతుర్వర్గఫలప్రదమ్॥

శ్లో. హరీశాదిస్తుతౌధర్మో ధనకామానృపాదితః
నిష్కామస్తదనుష్ఠానా న్మోక్షమాప్నోత్యసంశయమ్॥

తా. దాన యజ్ఞ జపాదులన్నియు, ధర్మార్థకామము లనే త్రివర్గఫలము నిచ్చును. ఒక్క సంగీత జ్ఞానమువలన ధర్మార్థ కామ మోక్షములనే చతుర్వర్గఫలమునిచ్చును. హరి హరాదులను స్తోత్రముచేసినందువలన ధర్మమును, రాజులు మొదలగు వారివలన ధనకామములును గలుగును. ధనకామాపేక్ష లేక కేవలము భగవంతుని గురించి సంగీతానుష్ఠానము చేసినయెడల మోక్షమును నిస్సందేహముగ పొందుచున్నాడు.

## 5. నాదోత్పత్తి.

శ్లో. ఆత్మావివక్షమాణోఽయం మనఃప్రేరయతేమనః
నాభిస్థవహ్నిమాహంతి సప్రేరయతిమారుతమ్॥

శ్లో. బ్రహ్మగ్రంధిస్థితోనాదః క్రమాదూర్ధ్వపథేచరన్
నాభిహృత్కంఠమూర్ధాస్యేష్వావిర్భవతి సధ్వనిః॥

శ్లో. నాదేతిసూక్ష్మసూక్ష్మశ్చ పుష్టో పుష్టశ్చకృత్రిమః
ఇతిపంచభిధాందత్తే పంచస్థానస్థితఃక్రమాత్॥

తా. తనచేత విచారింపబడిన యీయాత్మ మనస్సును ఉద్బోధించును. ఆ మనసు నాభియందున్న అగ్నినికొట్టును. ఆయగ్ని వాయువును ప్రేరేపించును. ఆత్మ, మనస్సు, అగ్ని, వాయువు, ఈ నాలుగున్ను కారణములై నాదమునుబుట్టించును* బ్రహ్మగ్రంథియందున్న ఆనాదము ఊర్ధ్వముఖముగాసంచరించుచు, క్రమముగా నాభి, హృదయము, కంఠము, మూర్ధము, ఆస్యము, వీటియందు పుట్టుచున్నది* ఈ నాదము నాభియందు అతిసూక్ష్మముగను, హృదయమందు సూక్ష్మముగను, కంఠమునందు పూర్ణముగను, శిరమునందు అపూర్ణముగను, ఆస్యమందు కృత్రిమముగను, పుట్టుచున్నది.

## 6. నాదలక్షణము.

శ్లో. ననాదేన వినాగీతం ననాదేన వినాస్వరః
ననాదేన వినారాగస్తస్మాన్నాదాత్మకంత్రయమ్॥

శ్లో. గీతంనాదాత్మకంవాద్యం నాదంవ్యక్త్యాంప్రశస్యతే
తద్ద్వయానుగతంనృత్యం నాదాధీనమతస్త్రయమ్॥

శ్లో. నాదేనవ్యజ్యతేవర్ణః పదంవర్ణాత్పదాద్వచః
వచసోవ్యవహారోయం నాదాధీనమతోజగత్॥

శ్లో. నాదోపాసనయాదేవా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః
భవంత్యుపాసితానూనం తస్మాదేతేతదాత్మకాః॥

తా. గీతము, స్వరము, రాగము, ఈ మూడున్ను నాదమును విడిచియుండవు గాన నివి నాదాత్మంబు * గీతము నాదాత్మకము, వాద్యము నాదముయొక్క వివరణచే ప్రకాశింపబడుచున్నది. నృత్యము గీతవాద్యముల ననుసరించి

యున్నదిగాన, శివుడును నాదాధీనము *నాదమువలన అక్షరమును, అక్షరము చే పదమును, పదముచే వాక్యమును, వాక్యముచే లోకవ్యవహారమును, అగుట వలన నిటితోకూడిన యావజ్జగత్తు నాదాధీనము. అట్టినాదము నుపాసించుట చే బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురున్ను ఉపాసింపబడిన నాదరూపులున్నారు గాన, ఈ త్రిమూర్తులున్ను నాదాత్మకులు.

## 7. నాదశబ్దార్థము.

శ్లో. నకారం ప్రాణనామానం దకారం మనలంవిదుః
జాతః ప్రాణాగ్ని సంయోగా త్తేననాదోభిధీయతే॥

తా. నాదమను రెండక్షరములలో, న, అను యక్షరము ప్రాణమని ప్రసిద్ధమై యుండును. ద, అను యక్షరము అగ్నిరూపమని చెప్పబడెను. ఈ కారణము చేత ప్రాణాగ్నులయొక్క సంయోగమువలన నాదమను శబ్దమాయెను.

## 8. నాదవిభజన.

శ్లో. ఆహతోనాహతశ్చేతి ద్వేధానాదోనిగద్యతే
తత్రచానాహతంనాద మేకాగ్రన్యస్తమానసాః॥

శ్లో. గురూపదిష్టమార్గేణ మహాంతః పర్యుపాసతే
దశరక్తివిహీనత్వా న్నమనోరంజకోనృణాం

శ్లో. తస్మాదాహతనాదస్య శృత్యాదిద్వారతోఖిలం
జ్ఞేయంవితన్వతేలోకే రంజనంభవభంజనం॥

తా. నాదము, ఆహతము, అనాహతము అని రెండువిధములు. అందులో అనాహతనాదము నిశ్చలమనస్సు గలవానికే సాధ్యము. ఈ అనాహతనాదము గురువులచే నుపదేశింపబడిన మార్గము చేతను [illegible] న్నారు. ఆ [illegible] రక్తి [illegible] చే [illegible] మనస్సు [illegible] ఆహత [illegible] శ్రుతిస్వరములుగా [illegible] ఆహతము [illegible] ను, పాపనాశనమును సంపూర్ణముగా చేయుచున్నది.

## 9. నాదవ్యవహారము.

శ్లో. వ్యవహారేత్వసౌ త్రేధా హృదిమంద్రోఽభిధీయతే
కంఠేమధ్యోమూర్ధ్ని తారో ద్విగుణశ్చోత్తరోత్తరమ్॥

తా. ఈనాదము హృదయమునందున్నప్పుడు మంద్రమనియు, కంఠమందున్నప్పుడు మధ్యమనియు, మూర్ధమందున్నప్పుడు తారమనియు చెప్పంబడును. హృదయ కంఠ మూర్ధ్నములను మూడుస్థానములందు నేయేప్రమాణముగ నుండునో ఆనాదము ఒకదానికంటె నొకటి ఎక్కువగల ద్విగుణమైయుండును. కనుక వీనికే మంద్రమధ్య తారనాములని పేరుకలిగియున్నది.

## 10. శ్రుతిలక్షణము.

శ్లో. ప్రథమశ్రవణాచ్ఛబ్ద శ్శ్రూయతేహ్రస్వమాత్రకః
సాశ్రుతిస్సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా॥

శ్లో. శ్రుతిభ్యశ్చస్వరాష్షడ్జ రిషభగాంధారమధ్యమాః
పంచమోధైవతశ్చాథ నిషాదఇతిసప్తతే॥

శ్లో. శ్రుతిభ్యస్స్యుస్స్వరాస్సర్వే స్వరేభ్యోగ్రామసంభవః
గ్రామేభ్యోజాతయోజాతాః జాతిభ్యోరాగసంభవః॥

తా. శ్రుతియనగా శ్రవణమువల్ల ముందుగా నేశబ్దము వినబడుచున్నదో అదిషడ్జము మొదలగు స్వరావయవలక్షణముగల హ్రస్వమాత్రక శబ్దవిశేషము శ్రుతియనంబడును.* అట్టి శ్రుతులవలన షడ్జమును, రిషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదములను సప్తస్వరములుకలిగెను. ఈ సప్తస్వరముల వలన గ్రామములును, గ్రామములవలన జాతులును, జాతులవలన రాగములును బుట్టుచున్నవి.

## 11. స్వరోత్పత్తికి ప్రధాన శ్రుతులు.

శ్లో. దీప్తాయతాచకరుణా మృదుర్మధ్యేతిజాతయః
శ్రుతీనాంపంచతాసాంచ స్వరేష్వేవంవ్యవస్థితిః

తా. దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్య అని శ్రుతి 5 జాతులుగలవి. ఆ జాతులు 22 భేదంబులై సప్తస్వరములయందు వ్యవస్థితి గలిగి యుండును.

## 12. ద్వావింశతి శ్రుతులు.

అనగా 22 శ్రుతులు.

శ్లో. చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జమధ్యమపంచమాః
ద్వేద్వేనిషాదగాంధారః త్రిస్త్రీరిషభధైవతాః॥

తా. షడ్జమునకు నాలుగు శ్రుతులును రిషభమునకు మూడుశ్రుతులును, గాంధారమునకు రెండుశ్రుతులును, మధ్యమమునకు నాలుగుశ్రుతులును, పంచమమునకు నాలుగుశ్రుతులును, ధైవతమునకు మూడుశ్రుతులును, నిషాదమునకు రెండుశ్రుతులును, ఇవ్విధంబున స్వరము లేడింటికి శ్రుతులు ఇరువదిరెండు కలిగియుండును.

## 13. ద్వావింశతి శ్రుతులకుగల పేర్లు.

శ్లో. తీవ్రాకుముద్వతీమందా ఛందోవత్యస్తుషడ్జగాః
దయావతీ రంజనీచ రక్తికా ఋషభేస్థితాః॥

శ్లో. రౌద్రీక్రోధీచగాంధారే వజ్రికాథప్రసారిణీ
ప్రీతిశ్చమార్జనిత్యేతాః శ్రుతయోమధ్యమాస్థితాః॥

శ్లో. క్షితిరక్తాచసందీపి న్యాలాపిన్యపిపంచమే
మదంతిరోహిణీరమ్య త్యేతా స్తిస్రస్తుధైవతే॥

శ్లో. ఉగ్రాచక్షోభిణీతిద్వే నిషాదేవసతఃశ్రుతీ
ఇత్యేతాస్సత్యసుప్రోక్తా సర్వేషుశ్రుతయోబుధైః॥

తా. షడ్జమునకు, తీవ్ర, కుముద్వతి, మంద, ఛందోవతి యను, 4 శ్రుతులును, రిషభమునకు, దయావతి, రంజని, రక్తిక, యను 3 శ్రుతులును, గాంధారమునకు, రౌద్రి, క్రోధ, యను 2 శ్రుతులును, మధ్యమమునకు, వజ్రిక,

ప్రసారిణి, ప్రీతి, మార్జని, యను 4 శ్రుతులును, పంచమమునకు, క్షితి, రక్త, సందీపని, ఆలాపిని, యను 4 శ్రుతులును, ధైవతమునకు, మదంతి, రోహిణి, రమ్య, యను 3 శ్రుతులును, నిషాదమునకు, ఉగ్ర, క్షోభిణి, యను 2 శ్రుతులును, కలిగియుండును.

## 14. శ్రుతిజాతి భేదములు.

శ్లో. దీప్తాయతామృదుర్మధ్యే షడ్జస్స్యాఋషభేపునః
సంస్థితాకరుణామధ్యే మృదుర్గాంధారకేపునః॥

శ్లో. దీప్తాయతామధ్యమేచ మృదుర్మధ్యేచ సంస్థితే
మృదుర్మధ్యాయతేఖ్యాతా కరుణాపంచమే స్థితాః॥

శ్లో. కరుణాయతామధ్యా ధైవతేస ప్తమేపునః
దీప్తామధ్యేతితాసాంచ శ్రుతీనాంబ్రూమహేభిదాన్॥

తా. షడ్జమునకు, దీప్త, ఆయత, మృదు, మధ్య, జాతులయందును, రిషభమునకు, కరుణ, మధ్య, మృదు, జాతులయందును, గాంధారమునకు, దీప్త, ఆయత, జాతులయందును, మధ్యమమునకు, దీప్త, ఆయత, మృదు, మధ్య, జాతులయందును, పంచమమునకు, మృదు, మధ్య, ఆయత, కరుణ, జాతులయందును, ధైవతమునకు, కరుణ, ఆయత, మధ్య, జాతులయందును, నిషాదమునకు, దీప్త, మధ్య, జాతులయందును, శ్రుతులు కలిగియుండును.



## 15. ద్వావింశతి శ్రుతిజాతి విమర్శపథకము.

| సంఖ్య. | సప్తస్వరములు. | శ్రుతులు. | జాతులు. |
|---|---|---|---|
| 1 | ,, | తీవ్ర. | దీప్త. |
| 2 | ,, | కుముద్వతి. | ఆయత. |
| 3 | ,, | మంద. | మృదు. |
| 4 | స | ఛందోవతి. | మధ్య. |
| 5 | ,, | దయావతి. | కరుణ. |
| 6 | ,, | రంజని. | మధ్య. |
| 7 | రి | రతిక. | మృదు. |
| 8 | ,, | రౌద్రి. | దీప్త. |
| 9 | గ | క్రోధ. | ఆయత. |
| 10 | ,, | వజ్రిక. | దీప్త. |
| 11 | ,, | ప్రసారిణి. | ఆయత. |
| 12 | ,, | ప్రీతి. | మృదు. |
| 13 | మ | మార్జని. | మధ్య. |
| 14 | ,, | క్షితి. | మృదు. |
| 15 | ,, | రక్త. | మధ్య. |
| 16 | ,, | సందీపిని. | ఆయత. |
| 17 | ప | ఆలాపిని. | కరుణ. |
| 18 | ,, | మదంతి. | కరుణ. |
| 19 | ,, | రోహిణి. | ఆయత. |
| 20 | ధ | రమ్య. | మధ్య. |
| 21 | ,, | ఉగ్రి. | దీప్త. |
| 22 | ని | క్షోభిణి. | మధ్య |

## 16. శ్రుతుల యొక్క స్వరస్థానములు.

శ్లో. ప్రథమాది చతుర్థాంతం షడ్జస్యస్థానముచ్యతే
పంచమోసప్తమాంతంచ రిషభస్యపదంవిదుః

శ్లో. అష్టమంనవమంచాథ గాంధారస్యనికేతనమ్
మధ్యమస్థానమాఖ్యాతం దశమాంద్యాత్రయోదశమ్॥

శ్లో. చతుర్దశాత్పంచమస్తు శ్రయేసప్తదశావధి
అష్టాదశాచ్చవింశాంతం ధైవతస్థానమీరితమ్
చరమే ద్వేనిషాదస్య స్థానేగాయకసమ్మతే॥

తా. ఈపైనుదహరించిన 22 శ్రుతులలో మొదటినుండి 4 వ శ్రుతివఱకు షడ్జస్థానము. 8 మొదలు 9 వ శ్రుతివరకు గాంధారస్థానము, 10 మొదలు 13 వ శ్రుతివఱకు మధ్యమ స్థానము. 14 మొదలు 17 వ శ్రుతి వరకు పంచమ స్థానము. 18 మొదలు 20 వ శ్రుతివరకు ధైవతస్థానము. 21 మొదలు 22 వ శ్రుతివరకునిషాదస్థానము.

## 17. నియతశ్రుతుల నిర్ణయము.

శ్లో. చతుర్థీనియతాషడ్జే రిషభే సప్తమీశ్రుతిః
నవమీ కిల గాంధారే మధ్యమే చత్రయోదశీ

శ్లో. పంచమే స్యాత్సప్తదశీ వింశీధైవతగోచరా
ద్వావింశీచనిషాదస్య శ్రుతయోనియతాఃశ్రుతిః॥

తా. సదరు 22 శ్రుతులలో షడ్జమునకు 4 వ శ్రుతియు, రిషభమునకు 7 వ శ్రుతియు, గాంధారమునకు 9 వ శ్రుతియు, మధ్యమమునకు 13 వ శ్రుతియును, పంచమమునకు 17 వ శ్రుతియు, ధైవతమునకు 20 వ శ్రుతియును, నిషాదమునకు 22 వ శ్రుతియును, ఇట్లేర్పడిన శ్రుతులు, నియమశ్రుతు లనంబడును.

## 18. శుద్ధ వికృత స్వరలక్షణము.

శ్లో. శుద్ధాశ్చ వికృతాశ్చేతి ప్రథమం ద్వివిధాస్స్వరాః
నియత శ్రుతిసంపన్నాః స్వరాశ్శుద్ధా ఇతి స్మృతాః
శ్రుత్యుత్కృష్టాపకృష్టాస్తు వికృతాః ప్రతిపాదితాః॥

తా. స్వరములు శుద్ధములని, వికృతములని, రెండు విధములు. శుద్ధములనగా, నియతములయిన శ్రుతులతో కూడుకొన్న స్వరములు శుద్ధములనంబడును, వికృతములనగా, నియతశ్రుతులకు హెచ్చుగాని తక్కువగాని అయిన స్వరములు వికృతములనంబడును.

## 19. గ్రామమూర్ఛనల యొక్క లక్షణము.

శ్లో. గ్రామస్స్వరసమూహస్స్యా న్మూర్ఛనాదేస్సమాశ్రయః
షడ్జగ్రామ భవేదాదౌ మధ్యమగ్రామ ఏవచ
గాంధార గ్రామ ఇత్యేతద్ గ్రామత్రయముదాహృతమ్.

శ్లో. షడ్జమధ్యమనామానౌ గ్రామౌ గాయంతి మానవాః
సతుగాంధార నామానం సలభ్యో దేవయోనిభిః

శ్లో. గాంధారగ్రామమాచష్ట తదాతం నారదో మునిః
ప్రవర్తతే స్వర్గలోకే గ్రామోసౌనమహీతలే॥

శ్లో. క్రమాత్స్వరాణాం సప్తానా మారోహశ్చావరోహణమ్
మూర్ఛనేత్యుచ్యతే గ్రామ ద్వయేతాస్సప్తసప్తచా॥

శ్లో. క్రమాద్గ్రామత్రయే దేవ బ్రహ్మవిష్ణుమహేశ్వరాః
హేమంత గ్రీష్మవర్షాసు గాతవ్యాస్తే యదా క్రమమ్॥

తా. స్వర సమూహ మూర్ఛనలతో కలిగి యున్నది గ్రామమని తెలియందగు* అది షడ్జగ్రామమనియు, మధ్యమ గ్రామమనియు, గాంధార గ్రామమనియు,

గ్రామములు మూడువిధములు* అందులో షడ్జమధ్యమములనే పేరు గలిగినట్టి వంటి రెండు గ్రామములును జనులవాడుకయందు ఉన్నవి. గాంధారగ్రామమును నారదుడు అభ్యసించి దేవతలకు ఉపదేశించెను. అందువలన గాంధారగ్రామము స్వర్గలోకమునందే గాని భూతలమందు వాడుకలేదు* క్రమముగా సప్తస్వరములయొక్క ఆరోహణ అవరోహణము మూర్ఛనమనియు, అటువంటి మూర్ఛనలు ఏడుచేరి గ్రామమనియు, ఒక్కొక్క గ్రామమునకు ఏడేసి మూర్ఛనల చొప్పున ఈ షడ్జమధ్యమ గ్రామములకు 14 మూర్ఛనలు కలిగి యుండును* క్రమముగా ఈ షడ్జమధ్యమ గాంధార గ్రామములకు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అధిదేవతలు. అవి హేమంత గ్రీష్మవర్ష ఋతువులయందు పాడతగినవి.

## 20. సప్తమూర్ఛనల పేళ్ళు.

శ్లో. షడ్జేతూత్తరమంద్రాదౌ రజనీ చోత్తరాయతా
శుద్ధషడ్జమత్సరికృదశ్వక్రాంతాహిరుద్గతా॥

శ్లో. మధ్యమేస్యాత్తు సౌవీరీ హారిణాశ్వాతతఃపరమ్
స్యాత్కలోపగతాశుద్ధ మధ్యామార్గేచ కౌరవీ
హృష్యకేత్యధతాసాంతు లక్షణంప్రతిపాద్యతే॥

శ్లో. చతురాఃపృథక్ శుద్ధాః కాకలీకలితాస్తథా
సాంతరాశ్చద్వయోపేతా షట్పంచాశదితీరితాః॥

శ్లో. నందావిశాలసుముఖీ చిత్రాచిత్రవతీసుఖా
ఆలాపాచేతిగాంధారగ్రామేస్యుఃసప్తమూర్ఛనాః॥

శ్లో. తాశ్చస్వర్గేప్రయోక్తవ్యా విశేషాస్తేనమోదితాః
తాసస్యమూర్ఛనాశుద్ధ షాడవౌడవదీరితాః॥

తా. షడ్జగ్రామమునకు ఉత్తరమంద్ర, రజని, ఉత్తరాయత, శుద్ధషడ్జ, మత్సరికృత, అశ్వక్రాంత, హిరుద్గత, అనిఏడు మూర్ఛనలున్ను, మధ్యమగ్రామము

నకు సౌవీర, హరిణాశ్వ, కలోపగత, శుద్ధమధ్య, మార్గ, కౌరవి, హృష్యక, అని ఏడుమూర్ఛనలున్ను, ఈషడ్జమధ్యమ గ్రామములందలి 14 మూర్ఛనలున్ను, ప్రత్యేకముగా, శుద్ధము, కాకలి, సాంతారము, ద్విరోపేతము అనినాలుగు భేదములుపొందుట వలన 56 మూర్ఛనలయ్యెను. గాంధార గ్రామమునకు, నంద, విశాల, సుముఖి, చిత్ర, చిత్రవతి, సుఖ, ఆలాప, అనిఏడు మూర్ఛనలు కలిగియున్నవి. అవి స్వర్గమందే ఉపయోగపడుటవలన వాటికి మాత్రము విశేష భేదంబు లిందు చెప్పఁబడలేదు.

21. ఇది షడ్జగ్రామ మండలము        ఇవి మూర్ఛనల పేర్లు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని | ఇది ఉత్తరమంద్ర అనే మొదటి మూర్ఛన. |
| రి | గ | మ | ప | ధ | ని | స | ఇది రజని అనే రెండవమూర్ఛన. |
| గ | మ | ప | ధ | ని | స | రి | ఇది ఉత్తరాయత అను మూడవ మూర్ఛన. |
| మ | ప | ధ | ని | స | రి | గ | ఇది శుద్ధషడ్జ అనే నాల్గవమూర్ఛన. |
| ప | ధ | ని | స | రి | గ | మ | ఇది మత్సరీకృతఅనే ఐదవ మూర్ఛన. |
| ధ | ని | స | రి | గ | మ | ప | ఇది అశ్వక్రాంతఅనే ఆఱవ మూర్ఛన. |
| ని | స | రి | గ | మ | ప | ధ | ఇది హిరుగ్గత అనే ఏడవ మూర్ఛన. |

22. ఇదిమధ్యమ గ్రామమండలము.        ఇవి మూర్ఛనల పేర్లు.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మ | ప | ధ | ని | స | రి | గ | ఇది సౌవీరి అనే మొదటి మూర్ఛన. |
| ప | ధ | ని | స | రి | గ | మ | ఇది హరిణాశ్వ అనే రెండవమూర్ఛన. |
| ధ | ని | స | రి | గ | మ | ప | ఇది కలోపగత అనే మూడవమూర్ఛన. |
| ని | స | రి | గ | మ | ప | ధ | ఇది శుద్ధమధ్య అనే నాల్గవ మూర్ఛన. |
| స | రి | గ | మ | ప | ధ | ని | ఇది మార్గ అనే ఐదవ మూర్ఛన. |
| రి | గ | మ | ప | ధ | ని | స | ఇది కౌరవి అనే ఆఱవ మూర్ఛన. |
| గ | మ | ప | ధ | ని | స | రి | ఇది హృష్యక అనే ఏడవ మూర్ఛన. |

ఈ ప్రకారముగా మూర్ఛనలు శార్ఙ్గదేవ రత్నాకరమందు విశేషించి చెప్ప బడియున్నవి గాన, గ్రంథభీతియగుటచే, రెండుగ్రంథములందు వ్రాసియుంటిమి.

### 23. షడ్జశబ్దార్థము.

శ్లో. నాసాకంఠమురస్తాలు జిహ్వాదంతాంశ్చ సంస్పృశన్
షడ్జస్సంజాయతే యస్మాత్తస్మాత్షడ్జ ఇతిస్మృతః॥

అన్యచ్చ. యేతస్వరాస్తుజాయంతే షడ్జాత్తేరిషభాదయః
తేనషడ్జఇతిప్రోక్తః స్వరోయంస్వవేదిభిః॥

తా. నాసిక, కంఠము, ఉరస్సు, తాలువు, జిహ్వ, దంతములు, అను నీయారు స్థానములయందు బుట్టునదిగాన షడ్జమనంబడును* మఱియు, రిషభము మొదలగు ఆఱుస్వరములు షడ్జమమువలన జనించుటచే షడ్జమనంబడును.

### 24. స్వరశబ్దార్థము.

శ్లో. స్వతోరంజయతి శ్రోతృచిత్తం సస్వరఉచ్యతే॥

తా. స్వ, స్వకీయముగ రం, రంజించునదిగాన స్వరమని చెప్పంబడును.

### 25. సప్తస్వరధ్వని దృష్టాంతములు.

శ్లో. షడ్జంమయూరోవదతి గావోరిషభభాషిణః
అజావికంతుగాంధారం క్రౌంచఃక్వణతి మధ్యమమ్॥

శ్లో. పుష్పసాధారణేకాలే పికఃకూజతి పంచమమ్
ధైవతం హేషతేవాజీ నిషాదం బృంహతేగజః॥

తా. షడ్జస్వరమువలె నెమలి కూయును.
రిషభ స్వరమువలె వృషభము ధ్వనించును.
గాంధార స్వరమువలె మేకశబ్దించును.
మధ్యమస్వరమువలె క్రౌంచపక్షి పలుకును.
పంచమస్వరమును వసంతఋతువునందు కోకిల కూయును.
ధైవతస్వరమువలె గుఱ్ఱము ధ్వనించును.
నిషాదస్వరమువలె ఏనుగు ఘీంకరించును.

## 26. సప్తస్వరముల నామములు.

శ్లో. షడ్జఋషభగాంధారం మధ్యమంపంచమస్తథా
ధైవతంనిషాదశ్చైవ సప్తస్వర విధియ్యతే॥

తా. ఈసప్తస్వరములకు షడ్జమము, రిషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, నిషాదము అని యౌగిక నామములు వీటికిఁబ్రతిగా నుచ్చారణసౌకర్యార్థ సంజ్ఞలు స, రి, గ, మ, ప, ధ, ని, అను నీ ఏడువర్ణములు ఏడుస్వరములుగా నేర్పరచబడినవి; ఈ సప్తస్వరంబులకు, ప్రకృతియని, వికృతియని, రెండు నామంబు లునుపబడినవి. వానిలో షడ్జస్వరమును, పంచమస్వరమును, నెప్పటికిఁ బ్రకృతిగానే చెప్పఁబడినది; తక్కిన రి, గ, మ, ధ, ని, అనుఅయిదుస్వరములును, ప్రకృతివికృతి భేదంబులు గల్గియుండుటచే, పైజెప్పిన సప్తస్వరములును పదియారు భేదంబులగుచున్నవి. వాటి పేళ్ళుక్రింద వ్రాయబడియున్నవి.

### స్వరముల ప్రకృతి వికృతిభేదములు.

| | ప్రకృతి. | వికృతి. | వికృతి. |
|---|---|---|---|
| స | షడ్జమము. | లేదు. | లేదు. |
| రి | శుద్ధరిషభము. | చతుశ్శ్రుతి రిషభము. | షట్ఛ్రుతి రిషభము. |
| గ | శుద్ధగాంధారము. | సాధారణ గాంధారము. | అన్తర గాంధారము. |
| మ | శుద్ధమధ్యమము. | ప్రతిమధ్యమము. | లేదు. |
| ప | పంచమము. | లేదు. | లేదు. |
| ధ | శుద్ధధైవతము. | చతుశ్శ్రుతి ధైవతము. | షట్ఛ్రుతి ధైవతము. |
| ని | శుద్ధనిషాదము. | కైశికనిషాదము. | కాకలి నిషాదము. |

ఈప్రకృతి వికృతిచే కలిగిన పదియారు స్వరములను, ఆరోహణావరోహణ గతిగా మూర్ఛనస్థై అనేక మూర్ఛనల చేత, అనంతా నైరాగాః యని అసంఖ్యేయములుగా అనేక రాగములను కల్పించుచున్నవి. ఈస్వరములు ఒకదానికంటె నొకటి హెచ్చుచుఁ బోవునేని ఆరోహణమనియు, తగ్గుచువచ్చునేని అవరోహణమనియుఁ జెప్పబడును. వీటియందు షడ్జమపంచమములను ఆధారముగా శ్రుతి గూర్చుకొని జంత్ర గాత్రములయందు వాడుకొనవలయును.

## 27. స్థాయిప్రకరణము.

అనుభవమందు చతుశ్శ్రుతి రిషభమును, శుద్ధగాంధారమును, ఒకస్థానము నందే పుట్టుచున్నవి; ఈ ప్రకారము షట్శ్రుతిరిషభమునకు, సాధారణ గాంధారమునియు, చతుశ్శ్రుతి దైవతమునకు, శుద్ధనిషాదమనియు, షట్శ్రుతిదైవతమునకు, కైశికనిషాదమనియు, ఒకధ్వనికే రెండేసి నామములు వాడుకయందున్నవి; గాన, ప్రకృతి వికృతిచే గలిగిన స్వరస్థానములు పండ్రెండున్ను, నామములు పదియారున్ను కలిగియున్నవి. వాటివివరము క్రింద వ్రాయబడుచున్నది.

### ఉదాహరణములు.

౧౬ పదియారు నామములు. / ౧౨ పండ్రెండు స్థానములు.

| | | | |
|---|---|---|---|
| షడ్జమము. | స | | 1 |
| శుద్ధరిషభము. | రి | | 2 |
| చతుశ్శ్రుతి రిషభము.<br>శుద్ధగాంధారము. | రి<br>గ | ఈ రెంటికి<br>ధ్వని ఒకటే. | 3 |
| షట్శ్రుతిరిషభము.<br>సాధారణ గాంధారము. | రి<br>గ | ఈ రెంటికి<br>ధ్వని ఒకటే. | 4 |
| అంతరగాంధారము. | గ | | 5 |
| శుద్ధమధ్యమము. | మ | | 6 |
| ప్రతిమధ్యమము. | మ | | 7 |
| పంచమము. | ప | | 8 |
| శుద్ధదైవతము. | ధ | | 9 |
| చతుశ్శ్రుతి దైవతము.<br>శుద్ధనిషాదము. | ధ<br>ని | ఈ రెంటికిని<br>ధ్వనిఒకటే. | 10 |
| షట్శ్రుతి దైవతము.<br>కైశిక నిషాదము | ధ<br>ని | ఈ రెంటికిని<br>ధ్వనిఒకటే. | 11 |
| కాకలి నిషాదము. | ని | | 12 |
| షడ్జమము. | స | | ,, |

ఇట్లు యీపైజెప్పినషడ్జమము మొదలు ఆరోహణగతిగా మరలషడ్జమమునందుట ఒకస్థాయియనంబడును. అది మంద్రము, మధ్యము, తారము, అని త్రివిధము. వీటి

యన్నిటిలో మంద్రస్థాయి తక్కువయయినది. మధ్యస్థాయి మంద్రతారములకు మధ్య నుండునది. తారస్థాయి ఈరెంటికంటె హెచ్చైనది.

## 28 ఉదాహరణము.

| మంద్రస్థాయి. | మధ్యస్థాయి. | తారస్థాయి. |
|---|---|---|
| స రి గ మ ప ధ ని (క్రింద చుక్కలు) | స రి గ మ ప ధ ని | స రి గ మ ప ధ ని (పైన చుక్కలు) |

ఇందునక్షత్రసంజ్ఞగల గుఱుతులు, స్వరములకు క్రిందనుండె నేని మంద్రస్థాయి యనియు, స్వరములకు పైనుండె నేని తారస్థాయియనియు, సంజ్ఞ లేకుండె నేని మధ్య స్థాయియనియు, నూహించునది; మఱియు ఈనక్షత్రగుఱుతులవలన స్వరాలంకార గీత పదవర్ణ కృతులు మొదలగుపాటలయొక్క స్వరములు యాస్థాయియందు ఉంటున్నవి యని తెలిసికొన వచ్చును.

## 29. దశవిధగమకములు.

శ్లో. ఆరోహమవరోహంచ ఢాలుస్ఫురితకంపితాః
ఆహతఃప్రత్యాహతశ్చ త్రిపుశ్చాందోళమూర్ఛనాః॥

| | | |
|---|---|---|
| 1 | ఆరోహణము. | సరిగమ పధనిస. |
| 2 | అవరోహణము. | సనిధప మగరిస. |
| 3 | ఢాలు. | సప, సమ, సగ, సరి, సస. |
| 4 | స్ఫురితము. | ససరిరి, గగమమ. [త్రినల్లార్చుట. |
| 5 | కంపితము. | పాపపపప, ఒక్కస్థానమునందు నిలిచితం |
| 6 | ఆహతము. | సరి రిగ గమ. |
| 7 | ప్రత్యాహతము. | సని నిద ధప. |
| 8 | త్రిపుచ్ఛము. | ససస, రిరిరి, గగగ, మమమ. |
| 9 | ఆందోళము. | సరిసపాప, రిగరిమామ. |
| 10 | మూర్ఛన. | సరిగమపధని, రిగమపధనిస. |

## 30. వాదిస్వరలక్షణము.

శ్లో. చతుర్విధస్వరావాదీ సంవాదీచవివాద్యపి
అనువాదితతోత్పత్తిః ప్రోక్తానీచ చతుర్విధం॥

తా. వాది, సంవాది, వివాది, అనువాది యని, స్వరములు నాలుగువిధములు.

### ఉదాహరణము.

వాదిస్వరము—సరిగమపధనిస - రిగమపధనిస - గమపధనిస - మపధనిస - పధనిస- ధనిస - నిస - స.

సంవాదిస్వరము—సనిధపమగరిస - నిధపమగరిస - ధపమగరిస - పమగరిస - మగరిస - గరిస - రిస - స.

వివాదిస్వరము—సమ్మగరి - సరిగమ - రిప్పమగ - రిగమప - గద్ధపమ. గమపధ-మన్నిధప - మపధని - పస్సనిధ - పధనిస.

అనువాదిస్వరము—సరిగ - రిగమ - గమప - మపధ - పధని - ధనిస.

ఈ నాలుగు విధములున్ను స్వర సంచారములలో ముఖ్యములై యున్నవి.

## 31. సప్తతాళములు.

శ్లో. ధ్రువోమఠ్యరూపకశ్చ ఝంపాత్రిపుటఏవచ
అటతాళేక తాళేచ సప్తతాళాః ప్రకీర్తితాః॥

తా. ధ్రువతాళము, మఠ్యతాళము, రూపకతాళము, జంపెతాళము, త్రిపుటతాళము, అటతాళము, ఏకతాళము, అనితాళములు ఏడు.

## 32. సప్తతాళములు ఏర్పరచినవారు.

శ్లో. భరతోదత్తళశ్చైవ ఆంజనేయోమతోధ్రువః॥

తా. భరతాచార్యులును, దత్తిళాచార్యులును, ఆంజనేయులును, కలసి ధ్రువతాళము నేర్పరచినారు.

శ్లో. మఠ్యతాళస్యకర్తారో మతంగార్జునకోహలాః॥

తా. మతంగ మహామునిన్ని, అర్జునుడున్ను, కోహలాచార్యులును, కలసి మఠ్యతాళమును జేసినారు.

శ్లో. ఆంజనేయఃకుంభజోపి యాజ్ఞవల్క్యస్తు రూపకే॥

తా. ఆంజనేయులున్ను, కుంభజోపిఅనగా, అగస్త్యులున్ను, యాజ్ఞవల్క్యుడును కలసి, రూపకతాళమును చేసినారు.

శ్లో. నందీశోభరతోశ్శౌనః ఝుంపాయాంచైవసప్తధా॥

తా. నందికేశ్వరుడు, భరతాచార్యులు, శౌనకాది మహామునియు కలసి ఝుంపెతాళమును జేసినారు.

శ్లో. నిశాచరపతిఃబ్రహ్మా త్రిపుటే శంఖపాలకః॥

తా. నిశాచరపతిఅనగా, రావణాసురుడున్ను, బ్రహ్మదేవుడున్ను, శంఖపాలకుడును కలసి, త్రిపుటతాళమును జేసినారు.

శ్లో. బలిఃకౌమార దేవేంద్రా అటతాళసముద్భవః॥

తా. బలిచక్రవర్తియు, దేవేంద్రుడును, కుమారస్వామియు కలసి, అట తాళమును జేసినారు.

శ్లో. మహాత్మాంచాపిసర్వేషాం ఏకతాళసమంవిధుః॥

తా. సమస్తమైనవారి అనుమతాలప్రకారము ఏకతాళమును సమముగజేస్సినారు.

## 33. సప్తతాళముల అంగలక్షణం.

| | |
|---|---|
| శ్లో. లఘుద్రుతద్విలఘుచ ధ్రువతాళాంగమేవచ॥ | । ೦ । । |
| ,, లఘుదృతలఘుశ్చైవ మఠ్యతాళేఇతిస్మృతః॥ | । ೦ । |
| ,, ద్రుతమేకంలఘుర్యేకో రూపకస్యప్రకీర్తితః॥ | ೦ । |
| ,, లఘుచానుద్రుతంచైవ ద్రుతోఝంపేతికీర్తితః॥ | । ◡ ೦ |
| ,, లఘుద్రుతద్రుతశ్చైవ త్రిపుటతాళాంగమేవచా॥ | । ೦ ೦ |
| ,, లఘుద్వంద్వంద్రుతదద్వం అటతాళాంగమేవచా॥ | । । ೦ ೦ |
| ,, ఏకతాళేలఘుస్మృతః॥ ... ... | । |

తా. ధ్రువ తాళమునకు, ఒకదృతము మూడు లఘువులును, మఠ్యతాళమునకు, రెండులఘువులు ఒకద్రుతమును, రూపకతాళమునకు, ఒక ద్రుతము ఒక లఘువును, ఝంపెతాళమునకు, లఘువు అను ద్రుతము దృతమును, త్రిపుట

తాళమునకు, ఒకలఘువు రెండు ద్రుతములును, అటతాళమునకు, రెండులఘువులు రెండు ద్రుతములును, ఏకతాళమునకు, ఒకలఘువును, ఈతీరున భరతాచార్యులు మొదలగువారివలన నియమించబడినవి.

### 34. సప్తతాళములకు ఘాతలు.

ఘాతఅనగా చేతిలో కొట్టెడిదెబ్బకు పేరు.

శ్లో. ధ్రువతాళేచతుర్ఘాతే మఠికాయాంత్రియేమతః
రూపకేతుద్విఘంపాయాం త్రయంతిృపుట యతీృయ
అటతాళేతుచత్వారో ఏకతాళేతుధఖ్కరః॥

తా. ధ్రువతాళమునకు ఘాతలు నాల్గును, మఠ్యతాళమునకు ఘాతలు మూడును, రూపకతాళమునకు ఘాతలు రెండును, ఝంపెతాళమునకు ఘాతలు మూడును, త్రిపుటతాళమునకు ఘాతలు మూడును, అటతాళమునకు ఘాతలు నాల్గును, ఏకతాళమునకు ఘాతఒకటియు, ఇటుల భరతాచార్యులవలన జెప్పబడెను. మఱియు, పాటలు మొదలగునవి పాడుటయందు, తాళమును దురితముగా వేయవలసినపుడు, ఆయాతాళములను ఘాతలచేతనే వేయబడును. ఇదియునుగాక, కంచు మొదలగు లోహతాళములతో వాయించునపుడు ఆయా తాళములను ఘాతలవల్లనే వేయఁబడును.

### 35. తాళములయొక్క షడంగములు. 36. తాళమునకుఁగల జాతులు.

| షడంగముల పేర్లు. | అంగ సంజ్ఞలు. | అక్షర కాలము |
|---|---|---|
| అనుద్రుతము. | ◡ | 1 |
| ద్రుతము. | ○ | 2 |
| లఘువు. | I | 4 |
| గురువు. | S | 8 |
| ప్లుతము. | Ś | 12 |
| కాకపాదము. | + | 16 |

| ఐదుజాతుల పేర్లు. | అక్షరములు. |
|---|---|
| చతురశ్రజాతి. | 4 |
| తిశ్రజాతి. | 3 |
| మిశ్రజాతి. | 7 |
| ఖండజాతి. | 5 |
| సంకీర్ణజాతి. | 9 |

తా. ఈషడంగములలో అనుద్రుతము, ద్రుతము, లఘువుఅనే ఈ మూడంగములు మాత్రము పైనుదహరించిన సప్తతాళములయందు నుపయుక్తములై యున్నవి. తక్కినవి నూటొక్క తాళముల యందు ప్రయోగింప బడియున్నవి. మఱియు ఏ తాళములకైనను, అనుద్రుతము ఒకఅక్షరమును, ద్రుతము రెండక్షరములును, లఘువు నాలుగక్షరములును గలిగియుండును. ఇందులో లఘువుమాత్రము జాతి భేదమగుచున్నది. లఘువును జాతిభేదముగా వేయుటకు చేతి వ్రేళ్ళయొక్క పేళ్ళను దెలిసియుండవలయును గాన, వాటిపేళ్ళుక్రింద వ్రాయబడుచున్నవి.




1—ఈ అంకెగలది, కనిష్ఠికయనే చిటికనవ్రేలు.

2—ఈ అంకెగలది, అనామికమను వ్రేలు.

3—ఈ అంకెగలది, మధ్యమవ్రేలు.

4—ఈ అంకెగలది, తర్జని వ్రేలు.

5—ఈ అంకెగలది, అంగుష్టమనేవ్రేలు.

ఈఐదువ్రేళ్ళయందు చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములనే ఐదుజాతుల లఘువులను, వేసెడి క్రమమెటువలెనంటే:—

చతురశ్రజాతిలఘువు వేయవలసినపుడు, తొలుతఘాతయు, తరువాత చిటికనవ్రేలును, అటువలెనే అనామిక, మధ్యమవ్రేలు వఱకు నాలుగక్షరములు వేయుట చతురశ్రమజాతి లఘువనంబడును.

త్రిశ్రజాతిలఘువు వేయునపుడు, ఘాత మొదలుకొని అనామికమను వ్రేలువఱకు మూడక్షరములు నడుపుట త్రిశ్రజాతి లఘువనంబడును.

మిశ్రజాతిలఘువు వేయునపుడు, ఘాత మొదలుకొని అంగుష్టమువఱకు బోయి మఱల చిటికనవ్రేలువఱకు ఏడు అక్షరములు వేయుట మిశ్రజాతిలఘువనంబడును.

ఖండజాతిలఘువు వేయునపుడు, ఘాత మొదలు తర్జనీ వ్రేలువఱకు ఐదక్షరములు వేయుట ఖండజాతి లఘువనంబడును.

సంకీర్ణజాతి లఘువు ఘాత మొదలు అంగుష్ఠమ నే[్రేలువఱకు బోయి, మరల చిటి

కెన, అనామిక, మధ్యమ వ్రేలువఱకు తొమ్మిదక్షరములు

క్రమముగా వేయుటకు సంకీర్ణజాతి లఘువనంబడును.

ఇందువల్లనే సప్తతాళములు ఐదుజాతులచే ముప్పది ఐదు తాళము లగుచున్నవి. వాటివివర మీ క్రింద వ్రాయబడుచున్నది.

## ముప్పదియైదు తాళముల విమర్శపథకము.

| సప్తతాళముల పేళ్లు. | అంగ సంజ్ఞ. | చతురశ్రజాతి. | తిశ్రజాతి. | మిశ్ర జాతి. | ఖండ జాతి. | సంకీర్ణ జాతి. |
|---|---|---|---|---|---|---|
| ధ్రువతాళము. | I O I I | 14 | 11 | 23 | 17 | 29 |
| మఠ్యతాళము. | I O I | 10 | 8 | 16 | 12 | 20 |
| రూపకతాళము. | O I | 6 | 5 | 9 | 7 | 11 |
| జంపెతాళము. | I ◡ O | 7 | 6 | 10 | 8 | 12 |
| త్రిపుటతాళము. | I O O | 8 | 7 | 11 | 9 | 13 |
| అటతాళము. | I I O O | 12 | 10 | 18 | 14 | 22 |
| ఏకతాళము. | I | 4 | 3 | 7 | 5 | 9 |

## 37. రాగస్థానముల విమర్శ.

ఈ గ్రంథమందుండు స్వరాలంకారగీతములకుగల రాగములయొక్క మేళముల ను సహా వాటిపై నేనుదహరింపఁబడియున్నవి. ఆయారాగస్థానములను దెలియుటకై ఈ క్రింప వ్రాయఁబడియున్న గుఱుతులనుబట్టి తెలుసుకొన వలయును.

శు—అనివ్రాసియుండు గుఱుతు, శుద్ధమనియు.

చ—అనివ్రాసియుండు గుఱుతు, చతుశ్శ్రుతియనియు.

ష—అనివ్రాసియుండు గుఱుతు, షట్ఛ్రుతియనియు.

సా—అనివ్రాసియుండు గుఱుతు, సాధారణ గాంధారమనియు.

అం—అని వ్రాసియుండు గుఱుతు, అంతర గాంధారమనియు.

ప్ర—అనివ్రాసియుండు గుఱుతు, ప్రతిమధ్యమనియు.

కై—అని వ్రాసియుండు గుఱుతు, కైశికనిషాదమనియు.

కా—అని వ్రాసియుండు గుఱుతు, కాకలి నిషాదమనియు గ్రహింపవలెను.

## ఉ దా హ ర ణ ము.

## మాయామాళవగౌళ రాగము.

| నెం. 1 | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | స | రి | గ | మ | ప | ధ | ని | స | స ని ధ ప మ గ రి స |
| | ,, | శు | అం | శు | ,, | శు | కా | ,, | ఇది అవరోహణము. |

**నెం. 2 మాయామాళవగౌళ—స, శురి, అంగ, శుమ, ప, శుధ, కాని.**

ఇట్లు పైనుదహరించిన ప్రకారము రాగములయొక్క ఆయాస్థానములను దెలియుటకై 1టో నెంబరుపద్ధతిగాను, 2డో నెంబరుపద్ధతిగాను, స్వరములకు క్రింద నుగాని, ప్రక్కనుగాని, ఏ యే అక్షరములు గుఱుతులుగా వ్రాసియుండునో ఆస్వరములను ఆయాస్థానములని యెఱుంగవలెను.

మఱియు పైనుదహరించిన 1, 2, నెంబర్లుగల మాయామాళవగౌళ రాగముయొక్క స్వరస్థానము లెవ్వియనగా, షడ్జము, శుద్ధరిషభము, అంతరగాంధారము, పంచమము, శుద్ధధైవతము కాకలి నిషాదము అనునవి ఇట్లే ఆయా రాగములయొక్క స్వరస్థానములు నివి ఇవి యని గ్రహించవలయును.

## 38. శ్రుతిజేయు పద్ధతి.

జంత్రగాత్రాదులయందు సంగీతమునభ్యసించువారలుముఖ్యముగా శ్రుతినిజేసికొనేవిధమును దెలిసియుండవలయును. సంగీతమునకు, మూలాధారమైనది శ్రుతి. అట్టి శ్రుతిని దెలిసియుండుట, సంగీతమవలంభించే ప్రతిమనుజునకు, నావశ్యకము. ఇప్పుడు శ్రుతినిగూర్చునే విధము దెలియక, పాడుచున్న వారినిఅనేకులనుజూచుచున్నాము. మఱియుకొందరు జంత్రములుగలవారున్ను శ్రుతినిజేయువిధము దెలియక ఒకరిసహాయమును కోరుటకద్దు. అట్టిసహాయములులేనప్పుడు మిక్కిలికష్టతరముగాన, శ్రుతిజ్ఞానమును ముఖ్యముగాగలిగియుండవలయును తంబురయందుగాని ఫిడిల్ యందుగాని శ్రుతినిజేయునప్పుడు తొలుత షడ్జమతంత్రిని హెచ్చించి, పేటవద్దనుండి బిరడాలకు సమీపమునసుండే మెట్టునద్దను

ఒకదారమునుకొలచి, ఆదారమును మూడుభాగములుచేసి, అందులో ఒకభాగమగు దారమును పైజెప్పిన మెట్టువద్దనుండి కొలచి,ఆకొలతచివర దేనితోనయినను గుఱుతు జేసి ఆ గుఱుతుపైన మన వ్రేలుంచి మీటినట్లయిన, అది పంచమస్వరము పలుకును. ఆనాదములో రెండవతంత్రిని జేర్చినయెడల శ్రుతిసరిపోను. ఆ శ్రుతిని సా, పా, యని యూహించి పాడుకొనవలెను.

ఇట్లు అపూర్వమయిన ఈ సులభమార్గము, విద్యార్థుల కత్యంతోపయుక్తము.

## 39. ఫిడిల్ వాద్య ప్రకరణము.

1. ఫిడిలు, వీణ మొదలగు జంత్రివాద్యముల నభ్యసించువారును, గాత్రముల యందభ్యసించువారును, ఈ గ్రంథమందుండు స్వరావళి మొదటినుండి గీతములవఱకు సాధకము చేయువిధ మెట్టువలెననగా; ఫిడిలుయందు ప్రథమకాలముగా స్వరములు వాయించవలసినపుడు, విళంబముగా నొక్కొక కమానుగీతకు ఒక్కొకస్వరము పలికేలాగునను, ఆయొక్క కమానులోనే రెండవకాలమున రెండేసిస్వరములు పలికేలాగునను,మూడవకాలమున కమానుఒకటికి నాలుగేసి స్వరములచొప్పునను, నాలవకాలమున కమానుఒకటికి ఎనిమిదేసి స్వరముల చొప్పునను, ఇవ్విధంబున స్వరావళి, జంటలు, అలంకారములు, గీతములు మొదలగునవి ఫిడిలుయందు సాధకము చేయావలయును.

2. గాత్రములయందు స్వరావళి మొదలగునవి సాధకము చేయవలసినపుడు, చేతతో వేసెడి తాళాక్షరమునకు, ప్రథమకాలమున వ్రేలికి ఒకస్వరముచొప్పునను, రెండవ కాలమున వ్రేలికి రెండేసి స్వరములచొప్పునను, మూడవకాలమున వ్రేలికి నాలుగేసి స్వరముల చొప్పునను, నాలవకాలమున వ్రేలికి ఎనిమిదేసి స్వరముల చొప్పునను, తాళమునకు సరిపఱచుకొని గాత్రములయందు సాధకము చేయవలయును. మఱియును, ఫిడిలు వాయించువారికి కమానుయొక్క నడకచేతనే తాళగతిని దెలియుటకు హేతువగుచున్నది. వీణ మొదలగు నఖవాద్యములవారికి మీటుయొక్క నడకయే తాళగతిని దెలుపును. గాత్రిపాటకులకు చేతియొక్క నడకవలననే తాళగతిని దెలియుచున్నది.

ఈ పైజెప్పిన పద్ధతులప్రకారము స్వరావళి మొదలగునవి అనులోమ, విలోమక్రమమున సాధకము జేసినయెడల తాళముయొక్క కాలప్రమాణము దృఢపడుటకు హేతువగుచున్నది.

## 40. అనులోమ విలోమక్రమము.

అనులోమమనగా—ఫిడేలుయందు ప్రథమకాలముగా కమాను వేయుచు, ఆ కమానులోనే క్రమముగా 1-2-3-4 కాలముల ఐదు స్వరములను, పలికించునది, అనులోమమనంబడును.

విలోమమనగా—స్వరములను ప్రథమకాలముగా నడుపుచు, కమానుచేత 1-2-3-4 కాలములుగా వాయించునది, విలోమమనంబడును.

మఱియు, గాత్రమునందు నభ్యసించువారలు, చేతితో ప్రథమకాలముగా తాళము వేయుచు నోటితో 1-2-3-4 కాలములు స్వరము పాడుట, అనులోమమనంబడును. స్వరములను ప్రథమకాలముగా పాడుచు, చేతితో వేసెడి తాళాక్షరములను 1-2-3-4 కాలములు నడిపించునది విలోమమనంబడును. ఇట్లు స్వరములన్నిటియందును, అనులోమ విలోమ క్రమమున సాధకము చేయవలయును.

## 41. షట్కాలముల విమర్శ.

షట్కాలములను క్రమముగా సాధకము చేయవలసినపుడు ఈ దిగువ నుదహరించిన ప్రకారము పాడుకొనవలయును.

ప్రథమకాలము. సా , , , , , , , , , , , , , , , , , , , , , , , , , , , , , , , ॥
రెండవకాలము. సా , , , , , , , , , , , , , , , రి , , , , , , , , , , , , , , , ॥
మూడవకాలము. సా , , , , , , , రి , , , , , , , గా , , , , , , , మా , , , , , , , ॥
నాల్గవకాలము. సా , , రి , , గా , , మా , , పా , , ధా , , ని , , సాం , , ॥
ఐదవకాలము. సా రి గా మా పా ధా ని సాం సాం ని ధా పా మా గా రి సా ॥
ఆఱవకాలము. సరిగమ పధనిసం సంనిధప మగరిస సరిగమ పధనిసం సంనిధప మగరిస ॥

ఈ పయినుదహరించిన షట్కాలములను తెలియుటకై తాళముయొక్క ఒక్క అక్షరమునకు మాత్రమే వ్రాయఁబడెనుగాన, తాళాంతములవఱకును ఇట్లేయూహించునది.

శ్రీరస్తు.

# సంగీతవిద్యాదర్పణము.

శ్లో. చైతన్యంసర్వభూతానాం నిర్వృతిర్జగదాత్మనామ్
నాదబ్రహ్మతదానంద మద్వితీయముపాస్మహే॥

సంగీతము నాదప్రధానంబై జంత్రగాత్రములయందు స్వరవిన్యాసముచే నత్యంత మధురమై, శిశుపశు ఫణ్యాదులకును పారవశ్య దాయకంబై ఐహికాముష్మిక సుఖదాయకంబునై యొప్పుచుండుశాస్త్రము. అట్టి సంగీతశాస్త్రమును యభ్యసించువారలు తొలుత శ్రుతిగూర్చుకొని పిమ్మట స రి గ మ ప ధ ని సా, సా ని ధ ప మ గ రి స, అనునీస్వరములను ఆరోహణ అవరోహణగతిగా, ఆదితాళము వేసికొని, కాలము దెలిసి హెచ్చుతక్కువలు గానీయక తాళమునకు సరిపెట్టుకొని, మందరవిళంబముగా ప్రథమకాలమును, పిమ్మట ద్వితీయకాలమును, అనంతరము తృతీయకాలమును, తదనంతరము చతుర్థకాలమును క్రమముగా ఆయారాగములయొక్క స్వరస్థానములను గుఱుతెరిగి సాధకము చేయవలయును.

మఱియును, ఆదితాళము ఒక్కలఘువును, రెండు ద్రుతములును గలది. దీనికి అంగసంజ్ఞ I 0 0 ఇందు నిలువుగీటుగల గుఱుతు లఘువనియు, రెండుసున్నాలు రెండు ద్రుతములనియు నెఱుంగవలెను. ఈ ఆదితాళముయొక్క లఘుద్రుతములను వేసెడిక్రమ మెట్లువలెనంటే, తొలుత లఘువును, పిమ్మట రెండుద్రుతములను వేయవలెను. లఘువు అనగా, ఘాత మొదలు మధ్యమావ్రేలువఱకు నాలుగక్షరములు వేయునది.

ద్రుతమనగా, దెబ్బ ఊసివేయుట. అందు ఊసియనగా, దెబ్బవేసిన చేతిని కుడివైపున విసరుట. ఇట్లే రెండవ ద్రుతమున్ను వేయవలెను. దీనివివర మీక్రింద వ్రాయబడుచున్నది.

## 1. రాగస్వరావళిపదములు.

మాయామాళవగౌళ - ఆదితాళము. 8 అక్షరములు.

| ఇది లఘువు. | | | | O ఇది ద్రుతము. | | O ఇది ద్రుతము. | |
|---|---|---|---|---|---|---|---|
| ఘాత. | చిటికనవ్రేలు. | అనామికవ్రేలు. | మధ్యవ్రేలు. | దెబ్బ. | ఉసి. | దెబ్బ. | ఉసి. |
| | | | ప్రథమ | కాలము. | | | |
| సా | రీ | గా | మా | పా | ధా | నీ | సాఁ॥ |
| సాఁ | నీ | ధా | పా | మా | గా | రీ | సా॥ |
| | | | రెండవ | కాలము. | | | |
| సారీ | గామా | పాధా | నీసాఁ | సాఁనీ | ధాపా | మాగా | రీసా॥ |
| | | | మూడవ | కాలము. | | | |
| స రి గ మ | ప ధ ని సఁ | సఁ ని ధ ప | మ గ రి స | స రి గ మ | ప ధ ని సఁ | సఁ ని ధ ప | మ గ రి స॥ |
| | | | నాల్గవ | కాలము. | | | |
| సరిగమపధనిసఁ | సఁనిధపమగరిస | సరిగమపధనిసఁ | సఁనిధపమగరిస | సరిగమపధనిసఁ | సఁనిధపమగరిస | సరిగమపధనిసఁ | సఁనిధపమగరిస |

ఇట్లు ఈక్రిందవ్రాసియుండు స్వరములు అన్నిటియందును, పైజెప్పిన 1, 2, 3, 4 కాలములపద్ధతిని సాధకము చేయవలయును. షట్కాలములను సాధకముచేయువారు 26 వ పేజీలోవ్రాయఁబడిన పద్ధతిని జూచి తెలుసుకొనవలెను.

2. సరిగమ - సరిగమ - సరిగమ - పధనిస̇
స̇నిధప - స̇నిధప - స̇నిధప - మగరిస॥
3. సరిగమ - సరిసరి - సరిగమ - పధనిస̇
స̇నిధప - స̇నిస̇ని - స̇నిధప - మగరిస॥
4. సరిగమ - పాసరి - సరిగమ - పధనిస̇
స̇నిధప - మాస̇ని - స̇నిధప - మగరిస॥
5. సరిగమ - పమగరి - సరిగమ - పధనిస̇
స̇నిధప - మపధని - స̇నిధప - మగరిస॥
6. సరిగమ - పమధప - సరిగమ - పధనిస̇
స̇నిధప - మపగమ - స̇నిధప - మగరిస॥
7. సరిగమ - సమగరి - సరిగమ - పధనిస̇
స̇నిధప - సపధని - స̇నిధప - మగరిస॥
8. సరిగమ  పాగమ - పా , , - పా , ,
గమపధ - నిధపమ - గమపగ - మగరిస॥
9. సా̇ నిధ - నీ ధప - ధాపమ - పా పా
గమపధ - నిధపమ - గమపగ - మగరిస॥
10. సరిగమ - పధనిస̇ - రి̇ సా̇ - నిధనిస̇
నీ నీ - ధపధని - ధా ధా - పమపధ
పా పా - మగమప - మామా - గరిగమ
స̇నిధప - మగరిస - స̇నిధప - మగరిస॥



## 2. మోహనరాగము-ఆదితాళము. 8 అక్షరములు.

| స | రి | గ | ప | ధ | స̇ | స̇ ధ ప గ రి స |
|---|---|---|---|---|---|---|
| ,, | చ | అం | ,, | చ | ,, | అవరోహణము. |

1. సారిగ - పధసా̇ - సా̇ధప - గరిసా॥
2. సరిగప - గపధస̇ - స̇ధపగ - పగరిస॥
3. సారిగ - రీగప - గాపధ - పాధస̇
   సా̇ధప - ధాపగ - పాగరి - గారిస॥
4. ససరిగ - పాపగ - ధధపా - గగపా
   పధసా̇ - స̇దధప - స̇దధప - పగరిస॥
5. సరిగరి - గపగప - గపధస̇ - సా̇సా̇
   రి̇స̇ధప - స̇ధపగ - ధపగరి - పగరిస॥
6. సరిగప - ధపగరి - సరిగప - గపధస̇
   స̇ధపగ - రిగపధ - స̇ధపగ - పగరిస॥
7. సరిగరి - గపధప - సరిగప - గపధస̇
   స̇ధపధ - పగరిగ - స̇ధపగ - పగరిస॥
8. సరిగరి - గారిగ - పా ,, - పా ,,
   గపధప - ధస̇ధప - గపధప - గగరిస॥
9. సరిగరి - గపగరి - సరిగప - గపధస̇
   స̇ధపధ - పగపధ - స̇ధపగ - పగరిస॥
10. సరిగరి - గారిగ - పగపా - ధపధా
    గపధప - ధస̇ధప - గపధప - గగరిస



## 3. తోడిరాగము – ఆదితాళము. 8 అక్షరములు.

| స | రి | గ | మ | ధ | ని | సా | సనిధమగరిస. |
|---|---|---|---|---|---|---|---|
| ,, | శు | సా | శు | శు | కై | ,, | అవరోహణము. |

1. సరిగమ - ధనిసా - సనిధమ - గరిసా॥
2. సరిగమ - గమగమ - గమధమ - ధనిసా
   సనిధమ - నిధమగ - ధమగరి - మగరిస॥
3. సరిగమ - ధమగరి - సరిగమ - ధనిసా
   సనిధమ - గమధని - సనిధమ - గరిసా॥
4. సరిగమ - రిగమధ - గమధని - మధనిస
   సనిధమ - నిధమగ - ధమగరి - మగరిస॥
5. సరిగమ - మనిధమ - సరిగమ - ధనిసా
   సనిధమ - గరిగమ - సనిధమ - గరిసా॥
6. సరిగమ - ధమగమ - సరిగమ - ధనిసా
   సనిధమ - గమధమ - సనిధమ - గరిసా॥
7. సరిగమ - ధాగమ - ధా ,, - ధా ,,
   గమధని - సనిధమ - గమగరి - గరిసా॥
8. సరిగరి - రిగమగ - గమధమ - ధనిసా
   సనిధని - నిధమధ - ధమగమ - గరిసా॥
9. సరిగమ - ధమనిధ - సరిగమ - ధనిసా
   సనిధమ - గమరిగ - సనిధమ - గరిసా॥
10. సరిగమ - ధనిసా - రిస సని - నిదధమ
    నిదధమ - మగమ - నిధమమగ - మగరిస॥



## 4. ధీరశంకరాభరణము- ఆదితాళము. 8 అక్షరములు.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని | స̇ | స̇ని ధ ప మగరిస. |
| ,, | చ | అం | శ | ,, | చ | కా | ,, | అవరోహణము. |

1. సరిగమ - పధనిస̇ - సా̇ ,, - సా̇ ,,

ధనిస̇రి̇ - స̇నిధప - స̇నిధప - మగరిస॥

2. సరిగమ - పధనిస̇ - సా̇ ,, - సా̇ ,,

ధనిస̇రి̇ - స̇స̇రి̇స̇ - స̇రి̇స̇ని - ధపమప

ధనిస̇రి̇ - స̇నిధప - స̇నిధప - మగరిస॥

3. సరిగమ - పధనిస̇ - సా̇ ,, - సా̇ ,,

ధనిస̇రి̇ - గ̇రి̇స̇రి̇ - స̇రి̇స̇ని - ధపమప

ధనిస̇రి̇ - స̇స̇రి̇స̇ - స̇రి̇స̇ని - ధపమప

ధనిస̇రి̇ - స̇నిధప - స̇నిధప - మగరిస॥

4. సరిగమ - పధనిస̇ - సా̇ ,, - సా̇ ,,

ధనిస̇రి̇ - గ̇మ̇గ̇రి̇ - స̇రి̇స̇ని - ధపమప

ధనిస̇రి̇ - గ̇రి̇స̇రి̇ - స̇రి̇స̇ని - ధపమప

ధనిస̇రి̇ - స̇స̇రి̇స̇ - స̇రి̇స̇ని - ధపమప

ధనిస̇రి̇ - స̇నిధప - స̇నిధప - మగరిస॥

5. సరిగమ - పధనిస̇ - సా̇ ,, - సా̇ ,,

ధనిస̇రి̇ - గ̇మ̇ప̇మ̇ - గ̇మ̇గ̇రి̇ - స̇నిధప

ధనిస̇రి̇ - గ̇మ̇గ̇రి̇ - స̇రి̇స̇ని - ధపమప

ధనిస̇రి̇ - గ̇రి̇స̇రి̇ - స̇రి̇స̇ని - ధపమప



ధనిసరి - ససరిస - సరిసని - ధపమప

ధనిసరి - సనిధప - సనిధప - మగరిస॥

6. సరిగమ - పధనిస - సా ,, - సా ,,

సరిగరిరిస - నిసరిసని - ధనిసనిధ

పధనిదధప - మపధపపమ - గమపమమగ

మపధని - సనిధప - మగరిస॥

7. సరిగమ - పధనిస - సా ,, - సా ,,

గరిరి ససని - రిస సని నిధ - సనినిధధప

నిదధపపమ - ధపపమమగ - మపగమపధ

సనిధప - సనిధప - మగరిస॥

8. సరిగమ - పధనిస - సా ,, - సా ,,

సస్సరిసని - నిన్నిసనిధ - దద్ధనిధప

పప్పధపమ - మమ్మపమగ - మపగమపధ

సనిధప - సనిధప - మగరిస॥

9. సరిగమ - పధనిస - సా ,, - సా ,,

సరిగారిస - నిస రి సని - ధనిసానిధ

పధనీధప - మపధాపమ - గమపామగ

మపధని - సనిధప - మగరిస॥

10. సరిగమ - పధనిస - సా ,, - సా ,,

సారిగరిస - నీసరి సని - ధానిసనిధ

పాధనిధప - మాపధపమ - గామపమగ

మపధని - సనిధప - మగరిస॥

## 5. మధ్యమావతిరాగము—ఆదితాళము. 8అక్షరములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| స | రి | మ | ప | ని | స̇ | స̇ ని ప మ రి స |
| ,, | చ | శు | ,, | కై | ,, | అవరోహణము. |

1. సారిమ - పనిసా̇ - సా̇నిప - మరిసా॥
2. సరిమప - మపనిస̇ - స̇నిపమ - పమరిస॥
3. సరిమప - నిపనిస̇ - స̇నిపమ - రిమరిస॥
4. సరిమరి - మపనిప - స̇నిపని - పమరిస॥
5. సరిమా - పమనిప - సరిమప - మపనిస̇
   స̇నిపా - మపరిమ - స̇నిపమ - పమరిస॥
6. సరిమరిమా - మపనిపనీ - స̇నిసా̇
   పనిస̇ని - స̇రి̇స̇ని - పనిస̇ని - పమరిస॥
7. సరిమప - నిపమరి - సరిమప - నిపనిస̇
   స̇నిపమ - రిమపని - స̇నిపమ - రిమరిస॥
8. సరిమరి - రిమపమ - మపనిప - నినిసా̇
   సనిపని - నిపమప - పమరిమ - రిరి సా॥
9. సారిమ - పమరిస - సరిమప - నినిసా̇
   సా̇నిప - మపనిస̇ - స̇నిపమ - రిరి సా॥
10. సరిమప - రిమపని - మపనిస̇ - సా̇సా̇
    స̇రి̇ మ̇రి̇స̇ ని - పని స̇నిపమ - రిమరిస॥



## జంటవరుసలు.

### 1. మాయామాళవగౌళ_ఆదితాళము. 8అక్షరములు

| స | రి | గ | మ | ప | ధ | ని | స̇ | స̇ నిధపమగరిస. |
|---|---|---|---|---|---|---|---|---|
| ,, | శు | అం | శు | ,, | శు | కా | ,, | అవరోహణము. |

1. ససరిరి - గగమమ - పపధధ - నినిస̇స̇
స̇స̇నిని - ధధపప - మమగగ - రిరి సస॥

2. ససరిరి - గగమమ - రిరిగగ - మమపప
గగమమ - పపధధ - మమపప - ధధ నిని
పపధధ - నినిస̇స̇ - స̇స̇నిని - ధధపప
నినిధధ - పపమమ - ధధపప - మమగగ
పపమమ - గగరిరి - మమగగ - రిరి సస॥

3. సస రిరి - గగరిరి - సస రిరి - గగమమ
రిరి గగ - మమగగ - రిరి గగ - మమపప
గగమమ - పపమమ - గగమమ - పపధధ
మమపప - ధధపప - మమపప - ధధనిని
పప ధధ - నిని ధధ - పప ధధ - నినిస̇స̇
స̇స̇ నిని - ధధనిని - స̇స̇ నిని - ధధపప
నినిధధ - పపధధ - నినిధధ - పపమమ
ధధపప - మమపప - ధధపప - మమగగ
పపమమ - గగమమ - పపమమ - గగరిరి
మమగగ - రిరి గగ - మమగగ - రిరి సస॥

4. సరి రిగ - సరి రిగ - సస రిరి - గగమమ
రిగగమ - రిగగమ - రిరి గగ - మమపప
గమమప - గమమప - గగమమ - పపధధ

మపపధ - మపపధ - మమపప - దధనిని
పదధని - పదధని - పపదధ - నిని స̇స̇
స̇నినిధ - స̇నినిధ - స̇స̇నిని - దధపప
నిదధప - నిదధప - నినిదధ - పపమమ
ధపపమ - ధపపమ - దధపప - మమగగ
పమమగ - పమమగ - పపమమ - గగరిరి
మగగరి - మగగరి - మమగగ - రిరిసస॥



## 2. మోహనరాగము—ఆదితాళము. 8 అక్షరములు.

| స | రి | గ | ప | ధ | స̇ | స̇ ధ ప గ రి స. |
|---|---|---|---|---|---|---|
| ,, | చ | అం | ,, | చ | ,, | అ వ రో హ ణ ము. |

1. సస రిరిగ - సరిగ - ససరిరి - గగ పప
రిరిగగప - రిగప - రిరిగగ - పపదధ
గగపపధ - గపధ - గగపప - దధస̇స̇
స̇స̇దధప - స̇దప - స̇స̇దధ - పపగగ
దధపపగ - ధపగ - దధపప - గగరిరి
పపగగరి - పగరి - పపగగ - రిరిసస॥
2. సాస - రీరిగగ - ససరిరి - గగపప
రీరి - గాగపప - రిరిగగ - పపదధ
గాగ - పాపదధ - గగపప - దధస̇స̇
సా̇స̇ - దాధపప - స̇స̇దధ - పపగగ
దాధ - పాపగగ - దధపప - గగరిరి
పాప - గాగరిరి - పపగగ - రిరిసస॥
3. ససరి - సారిసరి - ససరిరి - గగపప
రిరిగ - రీగరిగ - రిరిగగ - పపదధ

గగప - గాపగప - గగపప - దధసస

ససధ - సాధసధ - ససదధ - పపగగ

దధప - ధాపధప - దధపప - గగరిరి

పపగ - పాగపగ - పపగగ - రిరిసస॥

4. ససా - రీగసరి - ససరిరి - గగపప

రిరీ - గాపరిగ - రిరిగగ - పపదధ

గగా - పాధగప - గగపప - దధసస

ససా - ధాపసధ - ససదధ - పపగగ

దధా - పాగధప - దధపప - గగరిరి

పపా - గారిపగ - పపగగ - రిరిసస॥

## 3. తోడిరాగము— ఆదితాళము. 8 అక్షరములు.

| స | రి | గ | మ | ధ | ని | స | స ని ధ మ గ రి స |
|---|---|---|---|---|---|---|---|
| ,, | శు | సా | శు | శు | కై | , , | అవరోహణము. |

1 ససరి - ససరి సరి - ససరిరి - గగమమ

రిరిగ - రిరిగ రిగ - రిరిగగ - మమదధ

గగమ - గగమగమ - గగమమ - దధనిని

మమధ - మమధమధ - మమదధ - నినిసస

ససని - ససనిసని - ససనిని - దధమమ

నినిధ - నినిధనిధ - నినిదధ - మమగగ

దధమ - దధమధమ - దధమమ - గగరిరి

మమగ - మమగమగ - మమగగ - రిరిసస॥

2. సస స - రిరిగగ - ససరిరి - గగమమ

రిరిరి - గగగమమ - రిరిగగ - మమదధ

గగగ - మమమదధ - గగమమ - దధనిని

మమమ - దధధనిని - మమదధ - నినిస̇స̇

స̇స̇స̇ - నినినిదధ - స̇స̇నిని - దధమమ

నినిని - దధధమమ - నినిదధ - మమగగ

దధధ - మమమగగ - దధమమ - గగరిరి

మమమ - గగగరిరి - మమగగ - రిరిసస॥

3. ససరిగా - సరిగ - ససరిరి - గగమమ

రిరిగమా - రిగమ - రిరిగగ - మమదధ

గగమధా - గమధ - గగమమ - ధధనిని

మమధనీ - మధని - మమదధ - నినిస̇స̇

స̇స̇నిధా - స̇నిధ - స̇స̇నిని - దధమమ

నినిధమా - నిధమ - నినిదధ - మమగగ

దధమగా - ధమగ - దధమమ - గగరిరి

మమగరీ - మగరి - మమగగ - రిరిసస॥

4. ససారి - సారిగ - ససరిరి - గగమమ

రిరీగ - రీగమ - రిరిగగ - మమదధ

గగామ - గామధ - గగమమ - ధధనిని

మమాధ - మాధని - మమదధ - నినిస̇స̇

స̇సా̇ని - సా̇నిధ - స̇స̇నిని - దధమమ

నినీధ - నీధమ - నినిదధ - మమగగ

దధామ - ధామగ - దధమమ - గగరిరి

మమాగ - మాగరి - మమగగ - రిరిసస॥

## 4. ధీరశంకరాభరణము — ఆదితాళము.8 అక్షరములు.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| స | రి | గ | మ | ప | ధ | ని | సః | సఃనిధపమగరిస |
| ,, | చ | అం | శు | ,, | చ | కా | ,, | అవరోహణము. |

1. సస రిరి - గాస - సస రిరి - గగమమ
రిరిగగ - మారిగ - రిరి గగ - మమపప
గగమమ - పాగమ - గగమమ - పపధధ
మమపప - ధామప - మమపప - ధధనిని
పపధధ - నీ పధ - పపధధ - నినిసఃసః
సఃసఃనిని - ధాసఃని - సఃసఃనిని - ధధపప
నినిధధ - పానిధ - నినిధధ - పపమమ
ధధపప - మాధప - ధధపప - మమగగ
పపమమ - గాపమ - పపమమ - గగ రిరి
మమగగ - రీ మగ - మమగగ - రిరిసస॥

2. ససరిగ - సరి గరి - సస రిరి - గగమమ
రిరిగమ - రిగమగ - రిరి గగ - మమపప
గగమప - గమపమ - గగమమ - పపధధ
మమపధ - మపధప - మమపప - ధధనిని
పపధని - పధనిధ - పపధధ - నినిసఃసః
సఃసఃనిధ - సఃనిధని - సఃసఃనిని - ధధపప
నినిధప - నిధపధ - నినిధధ - పపమమ
ధధపమ - ధపమప - ధధపప - మమగగ

పపమగ - పమగమ - పపమమ - గగరిరి

మమగరి - మగరిగ - మమగగ - రిరి సస॥

3\. సరిగా - సారిగ - సస రిరి - గగమమ

రిగమా - రీగమ - రిరి గగ - మమపప

గమపా - గామప - గగమమ - పపదధ

మపధా - మాపధ - మమపప - దధనిని

పధనీ - పాధని - పపదధ - నినిస̇స̇

స̇నిధా - సా̇నిధ - స̇స̇నిని - దధపప

నిధపా - నీధప - నినిదధ - పపమమ

ధపమా - ధాపమ - దధపప - మమగగ

పమగా - పామగ - పపమమ - గగరిరి

మగరీ - మాగరి - మమగగ - రిరిసస॥

4\. ససస - రి రి రి - గ గ గ - మమమ

రి రి రి - గ గ గ - మమమ - ప ప ప

గ గ గ - మమమ - ప ప ప - దదధ

మమమ - ప ప ప - దధధ - ని ని ని

ప ప ప - దదధ - ని ని ని - స̇స̇స̇

స̇స̇స̇ - ని ని ని - దదధ - పపప

నినిని - దదధ - ప ప ప - మమమ

దదధ - ప ప ప - మమమ - గగగ

ప ప ప - మమమ - గ గ గ - రి రి రి

మమమ - గ గ గ - రి రి రి - సస స॥



5. మధ్యమావతి - ఆదితాళము. 8 అక్షరములు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| స | రి | మ | ప | ని | సా | సా ని ప మ రి స. |
| ,, | న | ఱ | ,, | ై | ,, | అవరోహణము. |

1. సస రిరి - సస రిరి - సస రిరి - మమపప
రిరిమమ - రిరిమమ - రిరిమమ - పప నిని
మమపప - మమపప - మమపప - నిని సాసా
సాసానిని - సాసానిని - సాసానిని - పపమమ
నిని పప - నిని పప - నిని పప - మమరిరి
పపమమ - పపమమ - పపమమ - రిరి సస॥

2. సస రిరి - సరి సరి - సస రిరి - మమపప
రిరిమమ - రిమరిమ - రిరిమమ - పపనిని
మమపప - మపమప - మమపప - నినిసాసా
సాసానిని - సాని సాని - సాసా
నిని పప - నిప నిప -
పపమమ - పప రి స

| | | | |
|---|---|---|---|
| | | సరిగ | రిగమ |
| | గ రి | రిగమ | గమప |
| 3. సా రిసప | మ గ | గమప | మపధ |
| మపధ | ప మ | మపధ | పధని |
| పధని | ధ ప | పధని | ధనిసా |
| సానిధ | ని సా | సానిధ | నిధప |
| నిధప | ధ ని | నిధప | ధపమ |
| ధపమ | ప ధ | ధపమ | పమగ |
| పమగ | మ ప | పమగ | మగరి |
| మ గరి | గ మ | మగరి | గ రిస॥ |

4. స రీ - రిమా రి స - సస రిరి - మమమప
రి మా - మపామరి - రిరిమమ - పపనిని
మపా - ప నీ ప మ - మమపప - నినిసాసా
సానీ - నిపానిసా - సాసానిని - పపమమ
ని పా - పమా పని - నిని పప - మమరిరి
ప మా - మ నీ మప - పపమమ - రిరి సస॥

జంటపరుసలు సమాప్తము.

---

 ఈ పైనుదహరించిన స్వరావళి మొదటినుండి జంటపరుసలు కడపటి వఱకును, ఆయారాగములయొక్క స్వరస్థానములను దెలిసి సాధకముజేసినయెడల, ముందు రాబోవు అనేకరాగములలోనుండెడి గీతములు, వర్ణములు, కృతులు మొదలగువాటిని బహుసులభముగా తమకైతామే బాడుకొనుటకు హేతువగుచున్నది. అదెట్లనిన; ఏరాగములకైనను ముఖ్యముగా, శుద్ధరిషభము-చతుశ్రుతిరిషభము సాధారణగాంధారము- ...గారము-శుద్ధమధ్యమము-ప్రతిమధ్యమము. శుద్ధధైవతము-చతుశ్రుతిధైవతము ...పదిస్వరస్థానములను తెలియునట్లు కొన్నిరా...గునవి వ్రాయుటయ్యెను. గాన, సంగీత ...గునవి తప్పక సాధకముచే వృద్ధిబొందియున్నారు. ... స్వరస్థానముల

గగగ - మమమ
మమమ - పపప -
పపప - దదధ - నినిని
సాసాసా - నినిని - దదధ -
నినిని - దదధ - పపప - మమమ
దదధ - పపప - మమమ - గగగ
పపప - మమమ - గగగ - రిరిరి
మమమ - గగగ - రిరిరి - ససస॥



నినిధప - నిపధనిమాప
దధపమ - ధమపధగామ
పపమగ - పగమపరీగ
మమగరి - మరిగమసారి
గగరిస - గసరిగనీస.

3. సరిరిగ - రిమగసారిగ
రిగగమ - గపమరీగమ
మమమప - మధపగామప
మపపధ - పనిధమాపధ
పధధని - ధసనిపాధని
ధనినిస - నిరిసధానిస.
సనినిధ - నిపధసానిధ
నిదధప - ధమపనీధప
ధపపమ - పగమధాపమ
పమమగ - మరిగపామగ
మగగరి - గసరిమాగరి
గరిరిస - రినిసగారిస.

## చతురశ్ర-ఖండ.

1. సమగరి - సగరిమగ
రిపమగ - రిమగపమ
గధపమ - గపమధప
మనిధప - మధపనిధ
పసనిధ - పనిధసని
ధరిసని - ధసనిరిస.
సపధని - సధనిపధ
నిమపధ - నిపధమప
ధగమప - ధమపగమ
పరిగమ - పగమరిగ
మసరిగ - మరిగసరి
గనిసరి - గసరినిస.

## ఖండ-చతురశ్ర.

1. సమగమప - రిగమప
రిపమపధ - గమపధ
గధపధని - మపధని
మనిధనిస - పధనిస.
సపధపమ - సధపమ
నిమపమగ - ధపమగ
ధగమగరి - పమగరి
పరిగరిస - మగరిస.

## చతురశ్ర-సంకీర్ణము.

1. సగరిగ - సరిగమగరిగమప
రిమగమ - రిగమపమగమపధ
గపమప - గమపధపమపధని
మధపధ - మపధనిధపధనిస.
సధనిధ - సనిధపధనిధపమ
నిపధప - నిధపమపధపమగ
ధమపమ - ధపమగమపమగరి
పగమప - పమగరిగమగరిస.

2. ససారి - సారిగమరిగసరి
రిరీగ - రీగమపగమరిగ
గగామ - గామపధమపగమ
మమాప - మాపధనిపధమప
పపాధ - పాధనిసధనిపధ
దధాని - ధానిసరినిసధని
నినీస - నీసరిగసరినిస.
ససాని - సానిధపనిధసని
నినీధ - నీధపమధపనిధ
దధాప - ధాపమగపమధప
పపామ - పామగరిమగపమ
మమాగ - మాగరిసగరిమగ
గగారి - గారిసనిరిసగరి
రిరీస - రీసనిధసనిరిస.

సంకీర్ణ - చతురశ్రము.

1. సగారిససరిగమ - రిగగమ
రిమాగరిరిగమప - గమమప
గపామగగమపధ - మపపధ
మధాపమమపధని - పదధని
పనీధపపధనిస - ధనినిస.
సధానిససనిధప - నిదధప
నిపాధనినిధపమ - ధపపమ
ధమాపధధపమగ - పమమగ
పగామపపమగరి - మగగరి
మరీగమమగరిస - గరిరిస.

ఈసర్వప్రస్తారమును శంకరాభరణ రాగమునందు క్రమముగా 1,2,3.4 కాలములపద్ధతిని, లయ వేసికొని సాధకము జేసినయెడల స్వరజ్ఞానము గలుగుచున్నది. పిమ్మట తమకిష్టమైన ఏతాళములోనైనను పల్లవిబాడుచూ, అందు అరావృతము చొప్పునను, ఆవృత్తముచొప్పునను, స్వరములను పంపకముజేసిపాడుకొనునది. మఱియు, తమకిష్టమైనరాగములో పల్లవులు బాడుకొనునప్పుడు ఆయారాగములకుగల శుద్ధవికృతి స్వరస్థానములను మాత్రము గుర్తెఱిగి స్వరపంపకము జేసిపాడుకొనునది.

స్వరజ్ఞానప్రస్తారము సంపూర్ణము.



శ్రీరస్తు.

# తాళప్రకరణము.

——:o:——

శ్లో॥ కల్యాణగుణసంపన్నం కర్ణాంతాయతలోచనమ్ ।
కౌసల్యాతనయంరామం కలయేకమలాపతిమ్॥

అవతారిక ॥ ఇహఖలు సకలభరత పండితమండలాఖండల సకలభరత ప్రవర్తకశిఖామణిః, కోహళాచార్యనామకః, పరమకారుణికః కశ్చిద్విపశ్చిత్సకలలోకోపకారకాయ తౌర్యత్రికోపరంజకం, తదాశ్రయత్వేనప్రసిద్ధం, దశప్రాణసమేతం, తాళస్వరూపం, సప్రపంచం ప్రతిపాదయితుకామశ్చికీర్షితస్యగ్రంధస్య నిర్విఘ్నపరిసమాపయే సర్వేశ్వరనమస్కారాత్మక మంగళాచరణపూర్వకం చికీర్షితం ప్రతిజానీతే విష్ణుమితి॥

తా॥ ఈలోకమందు సకలమైన విద్వస్సమూహమునకు శ్రేష్ఠుడైనవాడును, భరత ప్రవర్తకుల కెల్లరకును శిరోభూషణమైనవాడును, అత్యంతము దయశాలియునగు కోహళాచార్యుడనువిద్వాంసుడు సకలలోకోపకారముకొరకు నృత్తగీతవాద్యముల బ్రకాశింపజేయునట్టియు, ఆనృత్తగీతవాద్యములకుఆశ్రయమైనట్టియు, దశప్రాణములతోగూడిన తాళస్వరూపమును లెస్సగా బ్రతిపాదించుట కిచ్చయించినవాడై, ఈగ్రంధము నిర్విఘ్నముగా ముగియుకొరకు, సర్వేశ్వరనమస్కారరూపమైన మంగళమునుజేయుచు, తాళస్వరూపమును లెస్సగా బ్రతిపాదించెదనని ప్రతిజ్ఞ సేయుచున్నాడు.

శ్లో॥ విష్ణుంలోకగురుంప్రణమ్య శిరసాషణ్మార్గసందర్శకమ్
కీర్తిప్రీతికరం జనస్య లఘునాకాలేన కామప్రదమ్
సేవ్యంసద్యతిభిర్ద్రుతప్లుతపదం న్యాసాత్త్రలోకత్రయమ్।
తాళానాంకథయామి లక్షణమహంపూర్వోక్తశాస్త్రక్రమాత్॥

టీక ॥ లోకగురుం= లోక =సకలలోకములకును, గురుం = (వేదశాస్త్రరూపము చేత హితోపదేశము చేయువాడును, )షణ్మార్గసందర్శకం = షణ్మార్గ =న్యాయ

వైశేషిక, సంఖ్య, యోగ, పూర్వమీమాంస, ఉత్తరమీమాంసలనెడి ఆఱుమార్గములయొక్క, సందర్శకం = తత్వమునుజూపువాఁడును, జనస్య = భక్తజనునికి, కీర్తిప్రీతికరం= సత్కీర్తిసంతోషములను జేయువాఁడును, లఘునాకాలేన=శీఘ్రకాలముచేత, కామప్రదం=ఆభక్తజనునికి సకలాభీష్టముల నిచ్చువాఁడును, సద్యతిభిః = నారదాదిమహాయోగయతులచేత, సేవ్యం=ముఖ్యోపాయమై సేవింపఁదగినవాఁడును, ధ్రుతప్లుతపదన్యాసాత్తలోకత్రయం = ద్రుత=శీఘ్రముగా, ప్లుత=ఎత్తబడిన, పద=పాదములయొక్క, న్యాస=మెట్టులచేత, ఆత్త=పొందఁబడిన, లోకత్రయం = మూఁడులోకములుగలవాఁడునైన, విష్ణుం = సర్వవ్యాపకుఁడైన సర్వేశ్వరునిఁగూర్చి, శిరసాప్రణమ్య = సాష్టాంగనమస్కారములుచేసి, అహం = నేను, తాళానాం = తాళములయొక్క, లక్షణం = (స్వరూపమును) లక్షణమును, పూర్వోక్తశాస్త్రక్రమాత్ = పూర్వమందుఁజెప్పఁబడిన శాస్త్రక్రమమునుబట్టి, కథయామి = చెప్పుచున్నాను. ఈశ్లోకమందు లోకగురుంఅనెడి విష్ణువిశేషణములు తాళమందు అన్వయింపవలెను. అదెట్లనఁగా!

### తాళపక్షమందు.

టీక॥ లోక=లోకమందు. గురుం=శ్రేష్ఠమైనదియు, షణ్మార్గసందర్శకం = షణ్మార్గ = దక్షిణ, వార్తిక, చిత్ర, చిత్రతర, చిత్రతమ, అతిచిత్రములనెడి ఆఱుమార్గములయొక్క, సందర్శకం = కళలను జూపునపుడు జ్ఞాపకపరచునదియు, జనస్య= (పాడెడిజనునికి) ప్రీతికరం=కీర్తి సంతోషములను జేయునదియు, లఘునాకాలేన= లఘ్వాదికాలముచేత, కామప్రదం= (ఆపాడెడిజనునికి అభిలాషను గలుగజేయునదియు, సద్యతిభిః=సమస్రోతోవహ గోపుచ్ఛాదియతులచేత, సేవ్యం= తెలియఁదగినదియు, ద్రుతప్లుతపదన్యాసాత్త లోకత్రయం=ద్రుతప్లుతము మొదలగుఅంగములయొక్క, పద=స్థానములయందు, న్యాస=ప్రస్తారముచేత, ఆత్త=వ్యాపింపఁబడిన లోకత్రయం = మూఁడులోకములుగలదైన తాళముయొక్క స్వరూపమును సవిశేషముగా వివరించెదనని ప్రతిజ్ఞ సేయుచున్నాఁడు. ఈశ్లోకమందు నమస్కారత్వేన ప్రకృతమైనవిష్ణువుయందును, ప్రతిపాద్యత్వేన ప్రకృతమైనతాళమందును, లోకగురుం అను మొదలగు విశేషణములన్నియు పట్టినందున ప్రకృతశ్లేషఅనెడి అలంకారము. ఇది గాక విష్ణువిశేషణములు తాళమందు అన్వయించుటచేత, తాళము విష్ణుస్వరూపమని తెలిసితోఁచునది. ఈయర్థము త్రివిక్రమావతారమందు ప్రసిద్ధమైనది.

శ్లో॥ గీతప్రధానం ప్రవదంతినృత్తం నృత్తప్రధానం ప్రవదంతివాద్యం।
నృత్తగీతివాద్యచయప్రధానంతత్తాళమాద్యం ప్రణమామినిత్యమ్॥

టీక॥ గీతప్రధానం ప్రవదంతినృత్తం=అనగా, గీతము నృత్తమునకు ప్రధానమై యుండును, నృత్తప్రధానం ప్రవదంతివాద్యం=అనగా, నృత్తమునకు ప్రధానమైనది వాద్యము, నృత్తగీతివాద్యచయప్రధానం తత్తాళమాద్యం ప్రణమామినిత్యం=అనగా నృత్తగీతవాద్యములకు తాళముప్రధానమైయుండును. తత్ = అటువంటి తాళమును, నిత్యం = నిత్యమున్ను ప్రణమామి=నమస్కరించెదను.

తాళస్వరూపము ప్రతిపాదించుట వలనను తెలియుటవలనను
గలుగు ఫలమేమనగా జెప్పఁబడుచున్నది.

శ్లో॥ తౌర్యత్రికనిదానంచ తాళంచ కాలస్వరూపిణమ్
దశప్రాణసమోపేతం యోజానాతి సతత్వవిత్॥

తా॥ నృత్తగీతవాద్యములకు ఆదికారణమైనదియు, కాలాదిదశప్రాణములతో గూడినదియు, కాలస్వరూపమైనతాళమును ఎవరు దెలియుదురో, వారు సర్వేశ్వరరూపమును దెలిసినవారగుదురు. గాన, తాళస్వరూపము అవశ్యము దెలిసి యుండవలెనని నెఱుంగునది.

శ్లో॥ శివశక్త్యాత్మకంపుణ్యం యశశ్యంభుక్తిముక్తిదమ్
దశప్రాణాత్మకంతాళం యోజానాతి సతత్వవిత్॥

తా॥ శివశక్తిస్వరూపంబును, ఫలితంబును, కీర్తికరంబును, భుక్తిముక్తి ప్రదంబును, దశప్రాణసహితంబునునగు తాళమును, యెవరు దెలియుదురో, వారు సర్వేశ్వరరూపము దెలిసిన వారగుదురు. గనుక తాళస్వరూపము ముఖ్యముగా దెలిసియుండవలెనని నెఱుంగునది.

శ్లో॥ గీతంవాద్యంచనృత్యంచ తాళహీనంనరాజతే॥

తా॥ గీతవాద్యనృత్తములు, తాళములేకున్న ప్రకాశించవు.

శ్లో॥ లోకేవేదేచ వచసాం పాదయోర్గతి రుత్తమాం
తాళేనైవ వినాతేన స్ఖలనం తేషు దృశ్యతే

తా॥ లౌకికమందును, వైదికమందును, వాక్కులయందును, పాదములయొక్క వ్యాపారము తాళముచేతనే శ్రేష్ఠముగా ప్రకాశించును. ఆతాళముతోడ నేడ

బాసినయెడల ఆలౌకిక వైదిక వాక్కులయందును, ఆలౌకిక వైదిక పాఠగతుల యందును తొట్రుబాటు కానబడుచున్నది.

శ్లో॥ తౌర్యత్రికం తాళహీనం చాలయేత్పురుషాధమః
సపాపి నరకం ఘోర మాశు గచ్ఛతి సాన్వయః ॥

తా॥ ఎవరైనను నృత్తగీతవాద్యములను తాళానుగుణము గాకుండునటుల కొలి పించునో, వాడు పురుషాధముడనియు, పాపాత్ముడనియు వంశమువారి తోగూడా ఘోరమైననరకమును శీఘ్రముగాఁబొందును. కావున, సకల లౌకిక వ్యాపారములకున్ను తాళము అవశ్యము గనుక తాళస్వరూపమను నిరూపించేది యుక్తమని సిద్ధాంతము.

## తాళశబ్దవ్యుత్పత్తి.

శ్లో॥ తాళస్తలప్రతిష్ఠాయా మితి ధాతోర్ఘఞిస్మృతః ।

తా॥ తల అనెడి ధాతువు ప్రతిష్ఠయందు వచ్చును. ఆతలయనెడి ధాతువుమీద ఘ ప్రత్యయంబును ఆదివృద్ధియురాగా, తాల, అని నిలచెను. అటుమీఁదట సుప్రత్యయమును, ఋత్వవిసర్గలును రాగా తాళః అనెడిశబ్దము ఏర్పడెను. ఈ తాళశబ్దానకు వ్యుత్పత్తి (తలంతి తిష్ఠంతి గీతవాద్యనృత్తాని అత్రేతి తాళః=అనగా, గీతవాద్యనృత్తములు, అత్రి=ఈతాళమందు, తలంతి=లెస్స గా నున్నవి అనెడిఅర్థమందు తాళః=తాళశబ్దము వచ్చును. ఈతాళశబ్దానకు మఱియొక వ్యుత్పత్తి చెప్పబడుచున్నది. తల్యంతే ప్రకాశ్యంతే నృత్తగీత వాద్యాని యేనేతివాసతాళః = నృత్తగీతవాద్యములు దేనిచేత ప్రకాశింప బడునో అది తాళము. అను నీరెండు వ్యుత్పత్తులచేతను, తాళశబ్దమునకు అర్థము తెలియఁదగినది. ఈ తీరుననే సంగీత రత్నాకరమందు శార్ఙ్గదేవుడు తాళశబ్దానకు వ్యుత్పత్తిన్ని అర్థమున్ను చెప్పియున్నాడు.

శ్లో॥ తాళస్తలప్రతిష్ఠాయా మితి ధాతోః ప్రయోగతః
నృత్తంగీతం తథా వాద్యం యత స్తాళే ప్రతిష్ఠితం ।

తా॥ తలప్రతిష్ఠాయాం అనెడి ధాతువుయొక్క ప్రయోగమువలన తాళశబ్దముపుట్టి నది. ఈతలధాతువు, ప్రతిష్ఠార్థకమగుటచే నృత్తగీతవాద్యములు, తాళమం దు ప్రతిష్ఠితమైయున్నవి. కావున, తాళశబ్దముయొక్క వ్యుత్పత్తియు, అర్థ మున్ను ఇట్లని తెలిసికొనునది.

శ్లో॥ తకారశ్శంకరః ప్రోక్తో లకార శ్శక్తి రుచ్యతే
శివశక్తిసమాయోగా త్తాళినామాభిధీయతే

తా॥ తకారమునకు అధిదేవత శంకరుఁడును, లకారమునకు అధిదేవత పార్వతి యు నగుటచే, ఈపార్వతీ పరమేశ్వరులయొక్క సంయోగమువలన తాళ మనెడి శబ్దము బుట్టెనని చెప్పబడుచున్నది. అనగా, అర్ధనారీశ్వరుకరతల ద్వయమగుటచే, కుడిహస్తము శివస్వరూపమనియు, ఎడమహస్తము పా ర్వతిస్వరూపమనియు, ఈ రెండు హస్తములయొక్క సంయోగమువలన తాళమనెడి శబ్దము బుట్టెనని భావము.

శ్లో॥ హస్తద్వయస్య సంయోగే వియోగేచాపి వర్తతే
వ్యాప్తిమాన్యో దశప్రాణై స్సకాల స్తాళసంజ్ఞకః॥

తా॥ రెండుహస్తములకును, సంయోగేచ=సశబ్ద క్రియయు, వియోగేచ = నిశ్శబ్ద క్రియయుఁగలిగి దశప్రాణములతో గూడుకొని వర్తించెడి యేకాలముగలదో అది తాళమనఁబడును.

శ్లో॥ కాలఃక్రియాచ మానంచ సంభవంతి యదా సహ
తదా తాళస్య సంభూతి రితి జ్ఞేయం విచక్షణైః
కాలః క్షణాదికో జ్ఞేయ స్తాళయో ర్ఘటనం క్రియా
క్రియయో రంతరం యత్తు విశ్రామో మాన ముచ్యతే॥

తా॥ కాలము, క్రియ, మానము అను నీమూడును చేరి ఎప్పుడు ఏకకాలములో కలుగుచున్నవో అప్పుడు తాళమునకు ఉత్పత్తియని నెఱుంగునది. క్షణా దికము, కాలమని వ్యవహరింపఁబడును. కొట్టఁబడిన రెండువస్తువుల చేరిక, క్రియ యనఁబడును. క్రియలకు మధ్యనుండు విశ్రాంతికాలము, మానమని చెప్పఁబడును.

శ్లో॥ మార్గదేశీ గతత్వేన తాళోసౌ ద్వివిధో మతః
శుద్ధసాలగ సంకీర్ణా స్తాళభేదాః క్రమాన్మతాః॥

తా॥ మార్గము, దేశి, అనితాళము రెండు విధములు. అవి యొక్కొక్కటి శుద్ధము సాలగము, సంకీర్ణము, అని మూఁడువిధంబులై యున్నవి.

## తాళదశప్రాణములు.

శ్లో॥ కాలోమార్గః క్రియాంగాని గ్రహో జాతిః కళాలయః
యతిః ప్రస్తారకశ్చేతి తాళప్రాణాదశస్మృతాః॥

తా॥ కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము, అనునీపదిన్ని తాళమునకు ప్రాణములు.

### 1. కాలప్రాణలక్షణము.

శ్లో॥ ఉపర్యుపరి విన్యస్యాత్పద్మపత్రం శతం సకృత్
యః కాలస్సూచిసంభేదాత్ క్షణంచ పరికీర్తితః
లవక్షణై రష్టభిస్స్యాత్కాష్ఠో హ్యష్టలవాత్మకైః
అష్టకాష్ఠనిమేషస్స్యాన్నిమేషై రష్టభిఃకళాః
కళాభ్యాంతు చతుర్భాగో చతుర్భాగ మనుద్రుతమ్
అనుద్రుతౌచ బిందుస్స్యాద్బిందుభ్యాంచ లఘుర్భవేత్
లఘుద్వయం గురుశ్చైవ త్రిలఘుప్లుత ముచ్యతే
చాతుర్లఘుంచ కాకపాదం ఇత్యేతత్కాలలక్షణమ్॥

తా॥ నూఱుతామర రేకులను ఒకటిమీఁద నొకటిఁ జేర్పున దొంతరగాఁ జేర్చి సూదిచే పొడవగా రేకులన్నియు తెగినంత కాలము పేరు క్షణమనఁబడును. అట్టి క్షణములు ఎనిమిదైతే ఒకలవమని పేరు. ఆలవములు ఎనిమిదైతే ఒక కాష్ఠ. ఆకాష్ఠలు ఎనిమిదైతే ఒకనిమిషము. ఆనిమిషములు ఎనిమిదైతే ఒకకళ. ఆకళలు రెండైతే ఒక చతుర్భాగము. ఆచతుర్భాగములు రెండైతే ఒక అనుద్రుతము. అట్టిఅనుద్రుతములు రెండయితే ఒకద్రుతము. ద్రుతములు రెండయితే ఒకలఘువు. లఘువులు రెండయితే ఒకగురువు. ఆలఘువులు మూడయితే ప్లుతము. లఘువులు నాలుగైతే కాకపాదమగును. ఇందుల చేత తాళము నిర్ణయింపబడుచున్నది. మఱియు, ఇప్పుడు అనుద్రుతము మొదలుగాగల ఆఱుఅంగములు మాత్రము వాడుకయందున్నవి. కొందరు చతుర్భాగమును షడంగములను సహా వాడుచున్నారు. ఇది కాలప్రాణము. ఈ

కాల ప్రాణము తాళమును సాక్షాత్ సంబంధించియుండే తాళానకు నిర్వాహకంగాను ప్రాణమని దెలిసికొనునది.

## 2. మార్గప్రాణలక్షణము.

శ్లో॥ దక్షిణో వార్త్తికశ్చిత్రశ్చిత్రతరస్తతః
తథా చిత్రతమశ్చస్యాదతిచిత్రతమో మతః
షడేవం కథితా మార్గాస్తత్స్వరూపం నిరూప్యతే ॥

తా ॥ దక్షిణము, వార్త్తికము, చిత్రము, చిత్రతరము, చిత్రతమము, అతిచిత్రతమము అని మార్గములు ఆఱువిధములు.

శ్లో॥ తత్ర దక్షిణమార్గస్య మాత్రాష్టక ముదాహృతమ్
వార్త్తికేతు చతుర్మాత్రా శ్చిత్రమార్గే ద్విమాత్రకః
ఏకమాత్ర శ్చిత్రతరో ద్రుత శ్చిత్రతమే మతః
అతిచిత్రతమే మార్గే నుద్రుతపరికీర్తితః ॥

తా ॥ దక్షిణమార్గము = అనగా, ఏతాళమునకైనను తాళాక్షర కాలమునకు ఎనిమిది మాత్రల కాలము నడుచునది.

వార్త్తికము = అనగా, తాళాక్షర కాలమునకు నాలుగుమాత్రల కాలము నడుచునది.

చిత్రమార్గము = అనగా, తాళాక్షర కాలమునకు రెండుమాత్రల కాలము నడుచునది.

చిత్రతరము = అనగా, తాళాక్షర కాలమునకు ఒక మాత్రా కాలము నడుచునది. మాత్రఅనగా, నాలుగక్షరముల కాలము.

చిత్రతమము = అనగా, తాళాక్షర కాలమునకు ద్రుతకాలము నడుచునది. ద్రుతకాలమనగా రెండక్షరముల కాలము.

అతిచిత్రతమము=అనగా, తాళాక్షర కాలమునకు అనుద్రుతకాలము నడుచునది. అనుద్రుతకాలమనగా, ఒక యక్షర కాలము.

ఇటుల ఏతాళమునకైనను నొక్కొక్క తాళాక్షరమునకు పైనచెప్పఁబడిన ప్రకారము అక్షరము మొదలు మఱియొక అక్షరమునఅను జరుగు కాలదీర్ఘములను మార్గములని చెప్పఁబడుచున్నవి. ఇది మార్గమనెడి ప్రాణము. ఈమార్గమనెడి ప్రాణము తాళస్థాపకమైనందున [illegible] సదా గానమునకు ఆశ్రయమగుట

చేతను తాళసంబంధి అయినక్రియతో సంబంధించెనుగాన మార్గమున్న తాళమునకు ప్రాణమని దెలిసికొనునది.

## 3. క్రియా ప్రాణలక్షణము.

శ్లో॥ మార్గదేశిగతత్వేన తత్రాద్యస్య క్రియా ద్విధా ॥
నిశ్శబ్దా శ్శబ్దయుక్తాచ నిశ్శబ్దాతు కళోచ్యతే ॥

తా॥ క్రియలు, మార్గక్రియలని, దేశ్యక్రియలని రెండువిధములు. ఆమార్గక్రియలు నిశ్శబ్దక్రియలని, శబ్దక్రియలని రెండువిధములు. అందు నిశ్శబ్దక్రియకు కళ అనేపేరు చెల్లును గనుక ఆనిశ్శబ్దక్రియలు చెప్పబడుచున్నవి.

### నిశ్శబ్దక్రియలు.

శ్లో॥ తత్రావాపోథనిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశనమ్
చతుర్విధాశ్చ విజ్ఞేయా నిశ్శబ్దాశ్చ క్రియాబుధైః॥

తా॥ ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశము, అను నీనాలుగున్న నిశ్శబ్దక్రియలు.

### నిశ్శబ్దక్రియల లక్షణములు.

శ్లో॥ ఆవాపస్తత్ర హస్తస్యోత్తానస్యాం గుళికుంచనమ్
నిష్క్రామోథ స్తలస్యాస్య దంగుళీనాం ప్రసారణమ్॥
తస్య దక్షిణవిక్షేపో విక్షేపఇతి కథ్యతే
వివర్తనంచ హస్తస్య ప్రవేశోధో ముఖస్యచ ।

తా॥ ఆవాపము. అనగా, వెల్లికలగా యెత్తబడిన పతాకహస్తముయొక్క తర్జనీ మొదలగు నాలుగువేళ్లను ముడుచుట. నిష్క్రామము. అనగా, ఆ ముడిచిన హస్తముయొక్క వ్రేళ్లను విప్పుట. విక్షేపము, అనగా, ఆహస్తమును వెలుపల కుడిపార్శ్వమునకు విసిరించుట. ప్రవేశము. అనగా, ఆహస్తమును అప్రదక్షిణముగా క్రిందుగా ముందరికిరానిచ్చుట. ఈ నాలుగున్న నిశ్శబ్ద మార్గక్రియలు.

### శబ్దక్రియలు.

శ్లో॥ ధ్రువశ్శమ్యాశ్చ తాళశ్చ సన్నిపాత ఇతిస్మృతః
ఇతిశబ్దేన సంయుక్తో విజ్ఞేయశ్చ చతుర్విధః॥

తా॥ ధృవము, శమ్యము, తాళము, సన్నిపాతము అనునీనాలుగున్ను సశబ్దక్రియలు.

## సశబ్దక్రియల లక్షణములు.

శ్లో॥ ధ్రువోహస్తస్య పాతస్స్యా చ్చుటికా శబ్దపూర్వకః
శమ్యావామని పాతిస్తు తాళో దక్షిణ ఘాతికః॥
ఉభయోర్హస్తయోర్ఘాత స్సన్నిపాత ఇతి స్మృతః
ఏతామార్గ క్రియాశ్చైవ కథితా భరతజ్ఞకైః॥

తా॥ ధృవము. అనగా, శబ్దపూర్వకమైన చిటికవేయుట. శమ్య అనగా, కుడి హస్తమందు యెడమచేతి ఘాతవేయుట. తాళము. అనగా, యెడమహస్తమందు కుడిచేతి ఘాతవేయుట. సన్నిపాతము. అనగా, అభిముఖముగా నిలిచిన రెండుహస్తముల చే సమముగా ఘాతివేయుట. ఈనాలుగున్ను సశబ్ద మార్గక్రియలు.

## దేశ్యక్రియలు,

శ్లో॥ ధృవకా సర్పిణీకృష్ణా పద్మినీచ విసర్జితా
విక్షిప్తాచ పతాకాఖ్యా పతితాష్టౌ క్రియాతథా॥

తా॥ ధృవక, సర్పిణి, కృష్ణ, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాక, పతిత, అనునీఎనిమిదిన్ని దేశ్యక్రియలు.

## దేశ్యక్రియల లక్షణము.

శ్లో॥ సశబ్దా ధృవకాజ్ఞేయా స్సర్పిణీ వామగామినీ
కృష్ణాదక్షిణతఃపాతః పద్మినిస్స్యా దధోగతః॥
విసర్జితా బహిర్గతా విక్షిప్తాకుంచి తాత్మికా
పతాకాచోర్ధ్వగమనా పతితాకర పాతనా॥

తా॥ ధృవకము. అనగా, సశబ్దముతోగూడిన కుడిహస్తముయొక్క ఘాతి ధృవకమనఁబడును, సర్పిణి. అనగా, పతాక హస్తముచేత యెడమ పంకకు చేయిచాచుట. కృష్ణ. అనగా, ఎడమనుండి కుడిపార్శ్వమునకు రానిచ్చుట. పద్మిని. అనగా, అరచేతిక్రిందుగా అధోముఖముగా చేయిచాచుట. విసర్జిత. అనగా, ఆచేతిని వెలపల విసరుట. విక్షిప్త. అనగా, ఆ

హస్తముయొక్క వ్రేళ్లు ముడిచి లెక్కించుట. పతాకము, అనగా, పతాక హస్తముగా బట్టిన చేతిని పైకెత్తుట. పతితె. అనగా, ఆపైకెత్తిన హస్తమును దిగువకు దించుట. ఈవినిమిది దేశ్యక్రియలలో ధ్రువక అనునది మాత్రము సశబ్దక్రియ. సర్పిణి మొదలైన తక్కిన ఏడున్ను నిశ్శబ్దక్రియలని తెలియంగునది. ఇది క్రియ అనెడి ప్రాణము. ఈక్రియలు హస్తమందు నుండుటచే తాళమునకు జ్ఞాపకముగనుక తాళప్రాణమని తెలిసికొనునది.

## 4. అంగప్రాణ లక్షణము.

శ్లో॥ అనుద్రుతో ద్రుతశ్చైవ లఘుర్గురు ప్లుతస్తథా
కాకపాదం తథాప్రోక్తం తాళాంగాని చషడ్విధమ్॥

తా॥ అంగము అనగా, తాళసంఖ్యను దెలియుటకు సాధనంబగు సంజ్ఞావిశేషము అంగమనంబడును. అది అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము, అని అంగములు ఆఱువిధములు.

### అంగముల స్వరూపములు.

శ్లో॥ అనుద్రుతస్య రూపంచ అర్ధచంద్ర కళాత్మకం
ద్రుతస్తు వలయాకారో లఘురర్ధ శరాకృతిః
గురుర్వక్ర ధనుర్జ్ఞేయం ప్లుతస్తు శిఖరోగురుః
ఊర్ధ్వరేఖాచ తిర్యంచో కాకపాదః ప్రకీర్తితః॥

| | | |
|---|---|---|
| తా॥ అనుద్రుతము. అర్ధచంద్రునివలెనుండవలెను. | ... | ◡ |
| ద్రుతము. వలయాకారమయి యుండవలెను. | ... | ० |
| లఘువు. అర్ధబాణమువలె నుండవలెను. | ... | । |
| గురువు. ఎక్కుబెట్టిన విల్లువలె నుండవలెను. | ... | 8 |
| ప్లుతము. శిఖర రేఖతోగూడిన గురువువలె నుండవలెను. | ... | § |
| కాకపాదము. హంసపాదమువలె నుండవలెను. | ... | + |

### షడంగములనిఘంటు.

శ్లో॥ అనుద్రుతోర్ధ చంద్రస్యాత్ వ్యంజనం చానునాసికం
అస్యాక్షరంచ విరామంచ ఏకస్యాం [illegible]॥

తా॥ అనుద్రుతము, అర్ధచంద్రము, వ్యంజనము, అనునాసికము, అవ్యక్తము, విరామము. అను నీ ఆఱున్ను అనుద్రుతమునకు పేళ్లు.

శ్లో॥ అర్ధమాత్రా ద్రుతం వ్యోమం బిందుకం వలయాకృతమ్॥

తా॥ అర్ధమాత్ర, ద్రుతము, వ్యోమము, బిందువు, వలయము, చక్రము, అను నీ ఆఱున్ను ద్రుతమునకు పేళ్లు.

శ్లో॥ మాత్రైస్య సరళం హ్రస్వం కళాయాంచ లఘుర్భవేత్॥

తా॥ మాత్ర, సరళము, హ్రస్వము, కళ, లఘువు, శరము, అను నీ ఆఱున్ను లఘువుకు పేళ్లు.

శ్లో॥ ద్విమాత్రకం గురుర్వక్రం కాణోయమళదీర్ఘకమ్॥

తా॥ ద్విమాత్ర, గురువు, వక్రము, కాణము, యమళము, దీర్ఘము, అను నీ ఆఱున్ను గురువుకు పేళ్లు.

శ్లో॥ సమోద్భవం ప్లుతందీప్తం తథాత్ర్యంగం త్రిమాత్రకమ్॥

తా॥ సమోద్భవము, ప్లుతము, దీప్తము, త్రియంగము, త్రిమాత్ర, పకారము, అను నీ ఆఱున్ను ప్లుతమునకు పేళ్లు.

శ్లో॥ కాకోహంస పాదాఖ్యో నిశ్శబ్దశ్చ చతుర్లఘుః॥

తా॥ కాకపాదము, హంసపాదము, నిశ్శబ్దము, చతుర్లఘువు, చతుర్మాత్రా, చతుష్కళ, అను నీ ఆఱున్ను కాకపాదమునకు పేళ్లు.

## అంగములువాడే విధము.

శ్లో॥ ద్వయాంగుళో బాలచంద్రా ద్రుతస్తు చతురంగుళః
లఘురష్టాంగుళః ప్రోక్తో గురుస్యాత్షోడశాంగుళః॥
ప్లుతప్రమాణం కథితం చతుర్వింశతి రంగుళాః
ద్వాత్రింశత్కాకపాదస్య త్వానస్యాంగుళ నిర్ణయః॥

తా॥ అనుద్రుతము, రెండంగుళముల ప్రమాణమునను, ద్రుతము. నాలుగంగుళముల ప్రమాణమునను, లఘువు. ఎనిమిది అంగుళముల ప్రమాణమునను, గురువు. 16 అంగుళముల ప్రమాణమునను, ప్లుతము. మూడు మాత్రలకు 24 అంగుళముల ప్రమాణమునను, కాకపాదము. నాలుగు నిశ్శబ్దమాత్రలకు 32 అంగుళముల ప్రమాణమునను, ఈ క్రమంబున ఉన్నతం బెఱింగి వాడవలయును.

## అంగములకు హస్తక్రియలు వాడే విధము.

శ్లో॥ ధ్రువకా సర్పిణీకృష్యా ప్లుతేచ ప[illegible]తా
ధ్రువకా పతితేదీర్ఘే ధ్రువకాచ లఘుస్మృతః
ధ్రువకార్ధ ద్రుతశ్చైవ తదర్ధం మునయోవిదుః ॥

తా॥ సర్పిణీ, కృష్య, పతాక, పతిత, అను నీనాలుగు క్రియలచేత కాకపాదము వాడవలెను. ధ్రువక, సర్పిణీ, కృష్య, అను నీ మూడుక్రియలచేత ప్లుతము వాడవలయును. ధ్రువక, పతిత, అను నీ రెండు క్రియలచేత గురువు వాడదగినది. లఘువును ధ్రువక అనెడు క్రియచేత అష్టాంగుళ పరిమాణముగాను, ద్రుతమును. చతురంగుళ పరిమాణముగాను, అనుద్రుతమును. ద్వయాంగుళ పరిమాణముగాను వాడవలయును. అంగమనెడి ప్రాణము తాళావయవముగుచూ తాళసంబంధిగాన, ఇది తాళ ప్రాణమని నెఱుంగునది.

షోడశాంగముల పేళ్ళును, తదంగ సంజ్ఞలును అక్షర కాలమును ఈ క్రింద వ్రాయబడుచున్నవి.

| షోడశాంగముల పేళ్ళు | అంగసంజ్ఞలు. | అక్షరకాలము. |
|---|---|---|
| అనుద్రుతము. ... ... ... | ◡ | 1 |
| ద్రుతము. ... ... ... ... | ○ | 2 |
| ద్రుతవిరామము. ... ... ... | ◡○ | 3 |
| లఘువు. ... ... ... ... | \| | 4 |
| లఘువిరామము. ... ... ... | ◡ \| | 5 |
| లఘుద్రుతము. ... ... ... | ○ \| | 6 |
| లఘుద్రుతవిరామము. ... ... | ◡ ○ \| | 7 |
| గురువు. ... ... ... ... | 8 | 8 |
| గురువిరామము. ... ... ... | ◡ 8 | 9 |
| గురుద్రుతము. ... ... ... | ○ 8 | 10 |
| గురుద్రుతవిరామము. ... ... | ◡ ○ 8 | 11 |
| ప్లుతము. ... ... ... ... | § | 12 |
| ప్లుతవిరామము ... ... ... | ◡ § | 13 |
| ప్లుతద్రుతము. ... ... ... | ○ § | 14 |
| ప్లుతద్రుతవిరామము. ... ... | ◡ ○ § | 15 |
| కాకపాదము. ... ... ... | + | 16 |

## ౫. గ్రహప్రాణలక్షణము.

శ్లో॥ అతీతానాగతశ్చైవ సమశ్చ విషమోపిచ
గ్రహశ్చతుర్విధా ప్రోక్తః తత్త్వజ్ఞైస్తాళవిశారదైః॥

తా ॥ అతీతము, అనాగతము, సమము, విషమము, అని గ్రహణములు నాలుగువిధ ములు.

### గ్రహములవివరణము.

శ్లో॥ గీతాతీతేత్వతీతస్యాత్తాళాతీతేత్వనాగతః
గీతాదౌ తాళసంయుక్తే సమగ్రహ ముదీరితమ్।
అద్యంతయోరనియమో విషమశ్చ ప్రకీర్తితః
మాత్రాద్వయంచ తిస్రోవా క్వచిత్పంచ చతుష్టయే॥

తా ॥ గీతము నడిచినపిమ్మట తాళము నడచుట అతీతమనంబడును. తాళము నడిచినపిదప గీతమునడచుట అనాగత మనంబడును. తాళ గీతములు సమముగా నడుచుట సమమనంబడును. ఈమూడు విధములుగాక నడచునది విషమ గ్రహ మనంబడును. మఱియు, గీతాదులకన్నను తాళమాత్రలు రెండుగాని మూడుగాని, నాలుగుగాని, అతీతమైతే అది అతీతగ్రహమనియు, ఇన్ని మాత్రలే అనాగతమైతే అది అనాగత గ్రహమనియు, సదరు ప్రకారము 5,6,7,8, మాత్రలు గీతముకంటె అతీతమైనను, అనాగతమైనను అది విషమ గ్రహమనంబడును. ఇటుల రంగరాజ బొల్లభట్టులు మొదలైన భరతభాష్య వ్యాఖ్యాతలు నిర్ణయించినారు.

## 6. జాతిప్రాణలక్షణము.

శ్లో॥ అనుగాయామతేర్ధర్మం కారణం జాతిరుచ్యతే॥

తా ॥ అనుగతబుద్ధికి కారణమైన ధర్మము జాతియనంబడును. అనగా, లోకమందు అనేక మనుష్యులయందు ఏడు మనుష్యుడు అనెడి అనుగత బుద్ధిచేత మనుష్యత్వమనెడి జాతి సిద్ధించెను. ఆరీరున నే అనేక తాళములయందు ఇదిన్ని తాళము అనెడి అనుగత బుద్ధిచేత తాళత్వమనెడి జాతి కద్దని దెలిసికొనునది. ఇప్పుడు సకల మనుష్యులయందును, మనుష్యత్వమనెడి ఒక జాతియున్నను, ఆమనుష్యులయందు బ్రహ్మ క్షత్రియ వేశ్య శూద్ర

త్వము మొదలైన అవాంతర జాతులు గలిగినట్లు సకల తాళములయందును, తాళత్వమనెడి వ్యాపకజాతియుండి యున్నను, చతురశ్ర త్రిశ్రము మొదలైన అవాంతర జాతులు మతభేదములచేత కలవని చెప్పఁబడెను.

జాతులవివరణము.

శ్లో॥ చతురశ్రి త్రిశ్రమిశ్రా ఖండస్సంకీర్ణక స్తథా
పంచధాజాతయ స్సర్వే తత్స్వరూపం నిరూప్యతే॥

తా॥ చతురశ్రము, త్రిశ్రము, మిశ్రము, ఖండము, సంకీర్ణము, అని ఐదుజాతులు కలవు. అవి వరుసగా 4,3,7,5,9, సంఖ్యలుగలవు.

పైనజెప్పఁబడిన బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర సంకీర్ణములనెడి అవాంతర జాతులప్రకారము చతురశ్రజాతి బ్రిహ్మజాతిగా నెంచబడెనుగాన, బ్రహ్మను చతుర్ముఖములగుటచే చతురశ్రమనెడిజాతి ఏర్పడెను. గాన, ఆచతురశ్రిజాతికి 4 అక్షరముల లఘుకాలమాయెను. ఈచతురశ్రిజాతియొక్క 4 అక్షరములను మూటిచే గుణించగా 12 వచ్చును. ఆ 12 ను నాలుగుపాళ్లుచేయఁగా పాలు ఒక్కొంటికి 3 అక్షరములు ఏర్పడును. గాన, త్రిశ్రజాతికి 3 అక్షరముల లఘుకాలమాయెను. చతురశ్ర జాతియొక్క 4 అక్షరములును, త్రిశ్రజాతియొక్క 3 అక్షరములును, మిశ్రముచేయగా మిశ్రిజాతికి 7 అక్షరముల లఘుకాలమాయెను. ఈమిశ్రజాతియొక్క 7 అక్షరములును, త్రిశ్రముయొక్క 3 అక్షరములును కలపగా 10 అక్షరములగును. ఆపది అక్షరములను సగముగా ఖండించగా ఏర్పడిన 5 అక్షరములు ఖండజాతికి లఘుకాలమాయెను. చతురశ్రజాతియొక్క 4 అక్షరములును, త్రిశ్రమిశ్రములుకలిపి ఖండించిన ఖండజాతియొక్క 5 అక్షరములును కలపగా 9 అక్షరములు సంకీర్ణజాతికి లఘుకాలమాయెను. ఇవిగాక మఱికొన్ని లఘువులు చెప్పఁబడియున్నవి. అవి యెవ్వియనగా? మనుష్యలఘువు, స్వర్గలఘువు, హంసలఘువు, దేశ్యలఘువు, చిత్రలఘువు, దివ్యలఘువు, సింహలఘువు, వర్ణలఘువు, వాద్యలఘువు, కర్ణాటలఘువు, అని లఘువులు పదివిధములు. అవి క్రమముగా 4, 3, 7, 5, 9, 6, 8, 10, 12, 16, అక్షరకాలములు గలవై యుండును. ఈలఘువులలో పైజెప్పబడిన 5 జాతుల లఘువులుకూడ యున్నవి.

7. కళాప్రాణలక్షణము.

శ్లో॥ ఏక కళాచ ద్వికళా త్రికళాచ చతుఃకళా
ఏవంవిధాచ విజ్ఞేయం తాళలక్షణ కోవిదైః।

ఏకస్యాంచ కళాయాంతు లఘుః కళేతి కీర్తితః
ద్వికళాయాం గురుశ్చైవ త్రికళాప్లుత ముచ్యతే
నిశ్శబ్దలచతుష్కంచ కళాచతుష్కళాభిదే॥

తా॥ ఏకకళ, ద్వికళ, త్రికళ, చతుష్కళ, అని కళలు నాలుగుగలవు. అందు లఘువునకు ఒక్కకళయు, గురువునకు రెండుకళలును, ప్లుతమునకు మూడుకళలును, కాకపాదమునకు నాలుగుకళలును గలిగియుండును. చచ్చత్పుట, చాచత్పుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్టు, ఉద్ఘట్టములను, నీ 5 తాళములు కళలనంబడును.

## 8. లయప్రాణలక్షణము.

శ్లో॥ తాళాంతరాళవర్తీయః కాలోస్సౌలయనామకః
ద్రుతమధ్యవిళంబాశ్చ భవేయుస్త్రివిధాలయాః
ద్రుతోమధ్యో విళంబశ్చ ద్రుతశ్శీఘ్రతమోమతః
ద్విగుణాద్విగుణో జ్ఞేయౌ తస్మాన్మధ్యవిళంబితౌ॥

తా॥ తాళమునడుమ నడిచెడికాలము లయ యనంబడును. అదిద్రుతము, మధ్యము, విళంబితము, అని త్రివిధము. అందు మిక్కిలి శీఘ్రమయినది ద్రుతము. దానిని ఇనుమడింప మధ్యము. దానిని ఇనుమడింప విళంబితమగును. ద్రుతలయ అనగా పాడుటకు నెంతత్వరగా తాళమువేసికొని పాడనగునో అట్లు తాళమువేసికొనిపాడుట. మధ్యలయ అనగా, ధృతలయను రెట్టింపువిళంబము చేయుట. విళంబితము అనగా, ఆమధ్యలయకంటె రెట్టింపువిళంబము చేయుట. మఱియు, (గీతతాళాదీనా మేకత్రివిరామోలయః) అనియు, “శ్రుతిర్మాతా పితాలయః” అనియు, జెప్పియుండుటచేత లయ, ముఖ్యప్రాణమని తెలియంగునది.

## 9. యతిప్రాణలక్షణము.

శ్లో॥ లయప్రవృత్తినియమో యతిరిత్యభిధీయతే
సమస్రోతోవహాఖ్యాతా గోపుచ్ఛాకపిపీలికా
మృదంగేకాచ విషమాష్షడ్విధాయతి రుచ్యతే॥

తా॥ యతి అనగా, లయప్రవృత్తి క్రమమునకు యతి యనంబడును. అది సమయతి, స్రోతోవహాయతి, గోపుచ్ఛయతి, పిపీలికయతి, మృదంగయతి, విషమయతి, అని యతులు ఆఱువిధములు.

## యతులవివరణము.

శ్లో॥ ద్రుతాదీనాం సమాయత్ర ససమాఖ్యాయతి రిష్యతే॥

తా॥ ద్రుతలఘు గురుప్లుతములలో యేదైనను 8 8 8 యిట్లు సమానజాతీయములగు అంగములుగలది సమయతి యనంబడును.

శ్లో॥ ద్రుతాదీనాంవిపర్యాసా ద్యత్రసోత్రోవహాభిదా॥

తా॥ ద్రుతలఘుగురుప్లుతములలో నెద్దైనను ఇట్లు ∪ ౦ । 8 నదివలె ఆదియందు కొంచెమై క్రమముగా గొప్పఅంగములుగలది స్రోతోవహాయతి యనంబడును.

శ్లో॥ ఆదౌ గురుప్లుతాయత్ర లఘుద్రుతే లయాంతికే
గోపుచ్ఛయతిరాఖ్యాతం తాళజ్ఞాన వినోదినః॥

తా॥ గోపుచ్ఛయతిఅనగా, గోవుతోకవలె 8 । ౦ ∪ ఇట్లుఆదియందు గొప్పఅంగములున్ను రానురాను చిన్నవైన అంగములు గలది గోపుచ్ఛయతి యనంబడును.

శ్లో॥ లఘుద్రుతాశ్చమధ్యేమ్య రాద్యావంతే గురుప్లుతా
పిపీలికా యతిఖ్యాతా తాళజ్ఞాన వినోదినః॥

తా॥ పిపీలికాయతి అనగా, చీమవలె 8 । ౦ । 8 ఇట్లు లఘువులుగాని ద్రుతములుగాని మధ్యమందే, ఆద్యంతములందు గురువులుగాని ప్లుతములుగాని యుండునది పిపీలికయతి యనంబడును.

శ్లో॥ గురుప్లుతాశ్చ మధ్యేస్య ద్యాద్యావంతే లఘుద్రుతే
మృదంగయతి మిచ్ఛంతి లయజ్ఞాన వినోదినః॥

తా॥ మృదంగయతి అనగా, మృదంగమువలె ౦ । 8 । ౦ ఇట్లుగురుప్లుతాలలో నెద్దైనను మధ్య గొప్పఅంగములుండి, ఆద్యంతములందు లఘుద్రుతము లుండునది మృదంగయతి యనంబడును.

# ఏకోత్తరశతతాళనిర్ణయాని లిఖ్యంతే.

## నూటొక్క తాళముల లక్షణములు.

———:o:———

శ్లో॥ తాళేచచ్చత్పుటజ్ఞేయం గురుద్వంద్వం లఘుప్లుతమ్॥

1. చచ్చత్పుట తాళమునకు అంగసంజ్ఞ = ఽ ఽ । § ఇది విషమయతి.

శ్లో॥ గురుర్లఘూగురుశ్చైవ భవేచ్చాచ పుటాభిదే॥

2. చాచపుట తాళమునకు అంగసంజ్ఞ= ఽ । । ఽ ఇది పిపీలికయతి.

శ్లో॥ పలగాగలపశ్చైవ షట్పితా పుత్రికస్తథా॥

3. షట్పితాపుత్రిక తాళముఅంగసంజ్ఞ= § । ఽఽ । § ఇది విషమయతి.

శ్లో॥ మగణశ్చప్లుతాద్యంతం సంపద్వేష్టిక సంజ్ఞకే॥

4. సంపద్వేష్టిక తాళము= § ఽ ఽ ఽ § ఇది పిపీలికయతి.

శ్లో॥ ఉద్ఘట్టో తాళకర్తవ్యం మగణశ్చ ప్రకీర్తితః॥

5. ఉద్ఘట్ట తాళము= ఽ ఽ ఽ ఇది సమయతి.

శ్లో॥ ఆదితాళే లఘుస్స్మృతః॥

6. ఆదితాళమునకు అంగసంజ్ఞ= ।

శ్లో॥ దర్పణశ్చ ద్రుతద్వంద్వం గురుశ్చైక ప్రకీర్తితః॥

7. దర్పణతాళము= ○ ○ ఽ ఇది స్రోతోవహాయతి.

శ్లో॥ అష్టకృద్వస్తు చర్చర్యాం విరామాంతే ద్రుతౌలఘుః॥

8. చర్చరితాళము= ○8 । ○8 । ○8 । ○8 । ○8 । ○8 । ○8 । ○8 ।

శ్లో॥ సింహలీలే విధాతవ్యం లఘ్వాద్యంత ద్రుతత్రయమ్॥

9. సింహలీలతాళము= । ○ ○ ○ । పిపీలికాయతి.

శ్లో॥ ద్రుతద్వంద్వం యకారశ్చ కందర్పో పరికీర్తితః॥

10. కందర్పతాళము= ○ ○ । ఽ ఽ స్రోతోవహాయతి.

శ్లో॥ సింహవిక్రమ తాళేస్యుర్మగనోలపలాగపౌ॥

11. సింహవిక్రమ తాళము = ఽ ఽ ఽ । § । ఽ § § విషమయతి.

శ్లో॥ శ్రీరంగ శాఖ్యకే తాళే సగణో లఘుప్లుతౌ మతః॥

**12.** శ్రీరంగ తాళము= I I ऽ I §

శ్లో॥ రతిలీలే విధాతవ్యం లఘుద్వంద్వం గురుద్వయమ్॥

**13.** రతిలీల తాళము= I I ऽ ऽ

శ్లో॥ చత్వారోరంగతాళశ్చ ద్రుతౌగురు రతఃపరమ్॥

**14.** రంగతాళము = 0 0 0 0 ऽ

శ్లో॥ పరిక్రమే లఘుద్వంద్వం యగణస్తదనంతరమ్॥

**15.** పరిక్రమతాళము = I I I ऽ

శ్లో॥ ప్రత్యంగతాళ కర్తవ్యం మగణశ్చ లఘుద్వయమ్॥

**16.** ప్రత్యాంగతాళము= ऽ ऽ ऽ I I

శ్లో॥ లఘుచతుష్కం విరామాంతం గజలీలే ప్రకీర్తితః॥

**17.** గజలీలతాళము= I I I I ∪

శ్లో॥ లఘుర్గురు ప్లుతశ్చైవ త్రిభిన్నో పరికీర్తితః॥

**18.** త్రిభిన్నతాళము= I ऽ §

శ్లో॥ వీరవిక్రమ తాళేతు లద్రుతౌచ గురుస్తథా॥

**19.** వీరవిక్రమతాళము= I 0 0 ऽ

శ్లో॥ సవిరామం లఘుద్వంద్వం తాళస్యా ధంసలీలకే॥

**20.** హంసలీల తాళము= ∪ I I

శ్లో॥ వర్ణభిన్నాభిదేతాళే ద్రుతద్వంద్వం లఘుర్గురుః॥

**21.** వర్ణభిన్నతాళము= 0 0 0 I ऽ

శ్లో॥ రాజచూడా మణీతాళే దుృతౌనశ్చ ద్రుతౌలగౌ॥

**22.** రాజచూడామణి తాళము= 0 0 I I I 0 0 I ऽ ऽ

శ్లో॥ రంగద్యోతనతాళేతు మగణాల్లప్లుతోమతః॥

**23.** రంగద్యోతనతాళము= ऽ ऽ ऽ I §

శ్లో॥ గపౌద్రుతౌగలౌపశ్చ రాజతాళే ప్రకీర్తితః॥

**24.** రాజతాళము= ऽ § § 0 0 ऽ I I §

శ్లో॥ ద్వౌలౌపోగలప్లుశ్చైః సింహవిక్రీడితేలపా॥

25. సింహవిక్రీడిత తాళము= | | § ꙅ | § | § §

శ్లో॥ వేమ్రితాలా ద్రుతౌచ వనమాలీ నిగస్తథా॥

26. వనమాలితాళము= ○ ○ ○ ○ | | ○ ○ ꙅ

శ్లో॥ గురుర్లఘూ ద్రుతౌగశ్చ వర్ణేస్యా చతురశ్రకే॥

27. చతురశ్రవర్ణతాళము= ꙅ | | ○ ○ ꙅ

శ్లో॥ లఘుద్రుతౌ లఘూగశ్చ త్రిశ్రవర్ణే ప్రకీర్తితః॥

28. త్రిశ్రవర్ణతాళము= | ○ ○ | ꙅ

శ్లో॥ ప్రతితూర్యవిరామాంతౌ మిశాఖ్యే ద్వాదశద్రుతాః॥

29. మిశ్రతాళము= ○ ○ ○ 8 ○ ○ ○ 8 ○ ○ ○ 8

శ్లో॥ రంగప్రదీప తాళంచ తగణోలాప్లుతం భవేత్॥

30. రంగప్రదీపతాళము= ꙅ ꙅ | | §

శ్లో॥ లప్లుతంచాద్రుతౌదీర్ఘో హంసనాదో నిరూపితః॥

31. హంసనాదతాళము= | § ○ ○ ꙅ

శ్లో॥ జగణోలాగురుశ్చైవ సింహనాదే పరికీర్తితః॥

32. సింహనాదతాళము= | ꙅ | | ꙅ

శ్లో॥ తాళేస్యాన్మల్లికామోదే లద్వయఖా చతుష్టయమ్॥

33. మల్లికామోదతాళము= | | ○ ○ ○ ○

శ్లో॥ లఘుద్రుత చతుష్కంలౌ స్యాతాం శరభలీలకే॥

34. శరభలీలతాళము= | ○ ○ ○ ○ | |

శ్లో॥ తగణోల్లాప్లుతంకార్యం రంగాభరణ సంజ్ఞికే॥

35. రంగాభరణతాళము= ꙅ ꙅ | | §

శ్లో॥ తురంగలీల తాళేస్యా ద్రుతద్వంద్వం లఘుస్తథా॥

36. తురంగలీల తాళము= ○ ○ |

శ్లో॥ తపోలోగా ద్రుతౌగౌల ఫలపాగశ్చలద్వయమ్
నిశ్శబ్ద లచతుష్కంచ తాళేస్యా త్సింహానందనమ్॥

37. సింహానందన తాళము= ꙅ ꙅ | § | ꙅ ○ ○ ꙅ ꙅ | § | § ꙅ | |

శ్లో॥ రగణోలో గురుశ్చైవ జయశ్రీ పరికీర్తితః ॥

38. జయశ్రీతాళము = ఽ । ఽ । ఽ

శ్లో॥ భవేద్యత్ర విజయానందే లద్వయం గురుస్త్రియుక్ ॥

39. విజయనందనతాళము = । । ఽ ఽ ఽ

శ్లో॥ లో ద్రుతౌ ప్రతితాళేః తాళజ్ఞాన వినోదినః ॥

40. ప్రతితాళము = । O O

శ్లో॥ మకరందే ద్రుతద్వంద్వం లఘుత్రయ మతోగురుః ॥

41. మకరందతాళము = O O । । । ఽ

శ్లో॥ లఘుద్రుతౌ గలౌపశ్చ కీర్తితాళే ప్రకీర్తితః ॥

42. కీర్తితాళము = । O O ఽ । । §

శ్లో॥ ప్లుతోగశ్చ ప్లుతోగశ్చ తాళే విజయసంజ్ఞికే ॥

43. విజయతాళము = § ఽ § ఽ

శ్లో॥ సగణ ద్వితయంతత్ర తాళేతి జయమంగళః ॥

44. జయమంగళతాళము = । । ఽ । । ఽ

శ్లో॥ లఘుర్వక్రో ద్రుతౌ తాళే రాజ్యవిద్యాధరాభిదే ॥

45. రాజవిద్యాధరతాళము = । ఽ O O

శ్లో॥ సకారేన్మత్స్యతాళస్య కల్పితం లచతుష్టయమ్ ॥

46. మత్స్యతాళము = । । ఽ । । । ।

శ్లో॥ భకారతో గురుద్వంద్వం నిశ్శబ్ద మథవా భవేత్ ॥

47. నిశ్శబ్దతాళము = ఽ । । ఽ ఽ

శ్లో॥ జగణోలో ద్రుతౌపశ్చ జయతాళే ప్రకీర్తితః ॥

48. జయతాళము = । ఽ । । O O §

శ్లో॥ ద్రుతద్వంద్వం లఘుద్వంద్వం భవేత్తాళే కుడుక్కకే ॥

49. కుడుక్కతాళము = O O । ।

శ్లో॥ లఘుద్వంద్వం విరామాంతం తాళే నిస్సారుగాభిదే ॥

50. నిస్సారుకతాళము = । । O

శ్లో॥ ద్రుతద్వంద్వం విరామాంతం క్రీడతాళే ప్రకీర్తితః ॥
51. క్రీడతాళము ౦ ౦ ౦ ౮

శ్లో॥ త్రిభంగాఖ్యస్య తాళస్య జగణస్తగురుస్తథా ॥
52. త్రిభంగితాళము = । ఽ । ఽ

శ్లో॥ కోకిలప్రియ తాళస్యా ద్గురులశ్చా ప్లుతస్తథా ॥
53. కోకిలప్రియతాళము = ఽ । §

శ్లో॥ శ్రీకీర్తి సంజ్ఞి కేతాళే గురుద్వంద్వం లఘుద్వయమ్ ॥
54. శ్రీకీర్తితాళము = ఽ ఽ । ।

శ్లో॥ ముద్రికే తాళసంజ్ఞశ్చ గురుర్లఘూ నిశబ్దకః ॥
55. ముద్రికతాళము = ఽ । । +

శ్లో॥ చత్వారో బిందవోగుర్వా ఆద్యంతా బిందుమాలినీ ॥
56. బిందుమాలిని తాళము = ఽ ౦ ౦ ౦ ౦ ఽ

శ్లో॥ సమతాళే లఘుద్వంద్వం విరామాంతం ద్రుతద్వయమ్
57. సమతాళము = । । ౦ ౦ ౮

శ్లో॥ లఘూద్రుతౌ ప్లుతశ్చైవ తాళేస్యా నందనాభిధే ॥
58. నందనతాళము = । । ౦ ౦ §

శ్లో॥ మఠికాయాం విధాతవ్యా గురుబిందు ప్లుతాఃక్రమాత్ ॥
59. మఠికాతాళము = ఽ ౦ §

శ్లో॥ లఘుప్లుత సకారశ్చ తాళేచా భంగలీలకే ॥
60. అభంగలీలతాళము = § । । ఽ

శ్లో॥ దురీక్షణే లఘుద్వంద్వం గురురేకః ప్రకీర్తితః ॥
61. దురీక్షణతాళము = । । ఽ

శ్లో॥ వేదద్రుత విరామాంతం ద్వివారం విషమేమతః ॥
62. విషమతాళము = ౦ ౦ ౦ 8 ౦ ౦ ౦ 8

శ్లో॥ ఢంకికాం రగణేనస్యా త్కేపాంచి చైవయోజనా ॥
63. ఢంకితాళము = ఽ । ఽ

శ్లో ॥ నందితాళే సముద్దిష్ట లఘుర్బిందు లఘుర్గురుః ॥

64. నందితాళము = | O | 8

శ్లో ॥ ఏకేనైవ ద్రుతేనశ్చ ఏకతాళేన సంజ్ఞకః ॥

65. ఏకతాళము = O

శ్లో ॥ లఘుద్వంద్వం గురుద్వంద్వం కందుకః పరికీర్తితః ॥

66. కందుకతాళము = | | 8 8

శ్లో ॥ ఏకోలఘు గురుద్వంద్వం కంకాళే విషమేభవేత్ ॥

67. విషమకంకాళతాళము = | 8 8

శ్లో ॥ లద్వయం బిందుయుగ్మంచ గురుశ్చైవాభినందనే॥

68. అభినందనతాళము = | | O O 8

శ్లో ॥ నగణశ్చ లఘుశ్చైవ విరామాంత్య ద్రుతద్వయమ్
మల్లతాళమ ఇత్యేవం భరతజ్ఞో ప్రయుజ్యతే॥

69. మల్లతాళము = | | | | O O ∪

శ్లో ॥ చతుస్తాళే గురుఃపూర్వం తతోబిందు త్రయంభవేత్ ॥

70. చతుస్తాళము = 8 O O O

శ్లో ॥ అభంగతాళ కర్తవ్యం లఘూరంత త్రిమాత్రికమ్॥

71. అభంగతాళము = | §

శ్లో ॥ విరామాంతం లఘుద్వంద్వం డోంబిలీ పరికీర్తితః॥

72. డోంబిలితాళము = | | ∪

శ్లో ॥ రగణాద్బిందు యుగ్మంచ రాజబెంకోళ ఇష్యతే ॥

73. రాజబెంకోళతాళము= 8 | 8 O O

శ్లో ॥ ద్రుతద్వంద్వం లఘుద్వంద్వం గురుద్వంద్వంచ దీపకే॥

74. దీపకతాళము = O O | | 8 8

శ్లో ॥ ఏకేన సవిరామేణ లఘునా లఘుశేఖరః ॥

75. లఘుశేఖరతాళము = ∪ |

శ్లో ॥ ప్రతాప శేఖరేత్వంగ విరామాంత ద్రుతత్రయమ్॥

76. ప్రతాపశేఖరతాళము = O O O ∪

శ్లో॥ గజజంపేచ యనుభో విరామాంతం ద్రుతద్వయమ్॥

77. గజజంపెతాళము = ఽ O O ◡

శ్లో॥ చతుర్ముఖాభిదేతాళే జగణానంతరం ప్లుతమ్॥

78. చతుర్ముఖతాళము = । ఽ । §

శ్లో॥ వ్యోమద్వయ విరామాంతం లశ్చజంపాభిధీయ్యతే॥

79. జంపెతాళము = O O । ◡

శ్లో॥ సగణో భగణోవాపి ప్రతిమఠ్య బుధైస్స్మృతేః॥

80. ప్రతిమఠ్యతాళము = । । ఽ ఽ । ।

శ్లో॥ తృతీయ్యతాళ విజ్ఞేయం విరామాంత్య ద్రుతత్రయమ్॥

81. తృతీయతాళము = O O O ◡

శ్లో॥ వసంతతాళే కర్తవ్యం నగణో మగణస్తథా॥

82. వసంతతాళము = । । । ఽ ఽ ఽ

శ్లో॥ తాళే లలితసంజ్ఞశ్చ ద్రుతద్వంద్వం గురుర్లఘుః॥

83. లలితతాళము = O O ఽ ।

శ్లో॥ రతితాళే లఘుఃకార్య స్తతశ్చైవ గురుస్తథా॥

84. రతితాళము = । ఽ

శ్లో॥ తాళే కరుణయత్యాఖ్యే జ్ఞేయంబిందు చతుష్టయమ్॥

85. కరుణతాళము = O O O O

శ్లో॥ షట్తాళ సంజ్ఞకేతాళే బిందుషట్కం నిరంతరమ్॥

86. షట్తాళము = O O O O O O

శ్లో॥ వర్ధనే బిందుయుగళం తతఃకార్యౌ లఘుప్లుతే॥

87. వర్ధనతాళము = O O । ఽ

శ్లో॥ వర్ణయత్యాభిదేతాళే లఘుద్వంద్వం ప్లుతద్వయమ్॥

88. వర్ణయతితాళము = । । § §

శ్లో॥ రాజనారాయణేబిందు ద్వితయ్యం జగణోగురుః॥

89. రాజనారాయణతాళము = O O । ఽ । ఽ

శ్లో॥ ద్రుతద్వంద్వం ప్లుతశ్చైకో మదనే పరికీర్తితః॥
90. మదనతాళము= ○ ○ §

శ్లో॥ లఘుద్రుతౌ లఘుర్వక్రం ముకుందే తాళసంజ్ఞకే॥
91. ముకుందతాళము= | ○ ○ | 8

శ్లో॥ గరుడతాళే ద్రుతశ్చైవ విరామాంత్య ద్రుతత్రయమ్॥
92. గరుడతాళము= ○ ○ ○ 8

శ్లో॥ శ్రీనందనస్య తాళస్య భగణా ప్లుతయుక్తతే॥
93. శ్రీనందన తాళము= 8 | | §

శ్లో॥ బిందుర్లఘుప్లుతశ్చైవ లీలతాళే ప్రకీర్తితః॥
94. లీలతాళము= ○ | §

శ్లో॥ విలోకితే ర్లఘుర్వక్రిం శూన్యయుగ్మం ప్లుతస్తతః॥
95. విలోకితాళము = | 8 ○ ○ §

శ్లో॥ లలిత ప్రియతాళస్య సగణోనంతరం లఘుః॥
96. లలితప్రియ తాళము = | | 8 |

శ్లో॥ జనకాఖ్య తాళస్య నయతాశ్చతతో గురుః॥
97. జనక తాళము = | | | | 8 8 8 8 | 8

శ్లో॥ లక్ష్మీతాళ సమాయుజ్యంతే ద్రుతద్వంద్వం లఘుప్లుతమ్॥
98. లక్ష్మీతాళము = ○ ○ | §

శ్లో॥ లఘుద్వయం విరామాంతంలప్లుతో రాగవర్ధనే॥
99. రాగవర్ధనతాళము = | | § | ◡

శ్లో॥ పార్వతీ లోచనేతాళే లౌద్రుతౌ తనభాక్రమాత్॥
100. పార్వతిలోచనతాళము = | | ○ ○ 8 8 | | | | 8 | |

శ్లో॥ గగగాలలపశ్చైవ గలలాప సమన్వితమ్
101. వినాయకతాళము = 8 8 8 | | § 8 | | §

సర్వవిఘ్నోప శాంతార్థం తాళే వినాయకేభిదే॥

తాళప్రకరణము సమాప్తము.



# సంగీతప్రశ్నోత్తరములు



| ప్రశ్న. | ఉత్తరము. |
|---|---|
| 1. సంగీతమనగ నేమి? | సంగీతమనగా, గీతము, వాద్యము, నృత్తము, అను నీమూటిచేరిక సంగీతమనంబడును. మఱియు స్వర రాగ, తాళముల చేరికయు, సంగీతమనంబడును. |
| 2. సంగీతము ఎన్నివిధములు? | మార్గము, దేశి, అని సంగీతము రెండు విధములు. |
| 3. మార్గదేశిసంగీతమునకుగల భేదమేమి? | ఈశ్వర ప్రణీతమైన సంగీతము మార్గమనంబడును. ఆయాదేశములయందు వాడుకగలిగి మనోహరముగానుండు సంగీతము దేశియనంబడును. |
| 4 నాదము ఎట్లుగలిగెను? | ఆత్మ, మనస్సు, అగ్ని, వాయువు, అను నీనాలుగింటివలన నాదము బుట్టెను. |
| 5. ఆహత అనాహత నాదమునకుగల భేదమేమి? | ఆహతనాదమనగా, శ్రుత్యాదిముఖముగా జనరంజకముజేయునది. అనాహత నాదమనగా, తనచిత్తమున కొక్కనికే తెలియదగినది. |
| 6. శ్రుతియనగా నేమి? | స్వరారంభకావయవధ్వని విశేషము శ్రుతి యనంబడును. |
| 7. శ్రుతిఎన్నిజాతులు గలది? అది ఎన్ని భేదములగును? | దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్య, అని శ్రుతి ఐదుజాతులుగలిగి, 22 భేదములగుచున్నది. |
| 8. షడ్జాదిస్వరములకు నియతశ్రుతులెవ్వి? | ఛందోవతి, రతిక, క్రోధి, మార్జని, ఆలాపిని, రమ్య, క్షోభిణి, అనునవి నియతశ్రుతులు. |
| 9. శుద్ధవికృత స్వరములకు గలభేదమేమి? | నియతములైన శ్రుతులతో గూడుకొన్న స్వరములు శుద్ధము లనంబడును. నియతములకు హెచ్చుగాని తక్కువగాని అయిన స్వరములు వికృతము లనబడును. |
| 10. సప్తస్వరములలో వికృతిని పొందని స్వరము లెవ్వి? | షడ్జమము, శుద్ధరిషభము, అంతర గాంధారము, శుద్ధమధ్యమము, పంచమము, శుద్ధధైవతము, కాకలి నిషాదము, అనునవి వికృతిని పొందని స్వరములు. |

11. స్వరశబ్దానకు అర్థమేమి? (స్వ) స్వకీయముగా (రం) రంజించునది గాన స్వరమని చెప్పఁబడెను.

12. స్వరములు ఎన్నివిధములు? శుద్ధములని వికృతములని రెండువిధములు.

13. ఆరోహణ అవరోహణ మనునుగల భేదమేమి? స్వరములను క్రమముగా హెచ్చుచూ బోవునది ఆరోహణమనియు, అట్లే తగ్గుచూ వచ్చునది అవరోహణమనియు చెప్పఁబడును.

14. షడ్జశబ్దానకు అర్థమేమి? రిషభము మొదలుగాగల ఆఱుస్వరములు షడ్జమమువలన బుట్టుటచే షడ్జమనంబడును. మఱియు, నాశికము, కంఠము, ఉరస్సు, తాలువు, జింహ్వ, దంతములు, అను నీ ఆఱుస్థానములయందు గలిగిన నాదమగుటచే షడ్జమనంబడును.

15. గ్రామభేదములనగా నేమి? గ్రామభేదములనగా, పాడుటకు శ్రుతిగూర్చుకొనుటలు.

16. గ్రామము లెన్ని విధములు? షడ్జగ్రామము, మధ్యమగ్రామము, గాన్ధారగ్రామము అని మూడు విధములు.

17. షడ్జగ్రామమనగా నేమి? మంద్రముయొక్క షడ్జస్థానమును ఆధార శ్రుతిగా నేర్పరచుకొని శ్రుతిగూర్చుకొనుట.

18. మధ్యమగ్రామమనగా నేమి? మంద్రషడ్జమముయొక్క మధ్యమ స్వరమువఱకు బోయి, ఆమధ్యమ స్వరమును ఆధారషడ్జమముగా నేర్పఱచుకొని శ్రుతిగూర్చుకొనుట.

19. గాన్ధారగ్రామమనగా ఎట్టిది? మధ్యమగ్రామముయొక్క షడ్జస్థానము మొదలు ఒకస్థాయి ఆరోహణముగాపోయి, దానిపైనున్న గాన్ధార స్వరమును ఆధార షడ్జమముగా శ్రుతిగూర్చుకొనుట.

20. రాగమనగా నేమి? స్వరవర్ణములచే అలంకరింప బడినదై జనుల చిత్తమునకు రంజకమైన ధ్వని విశేషము రాగమనంబడును.

21. రాగము ఎన్ని విధములు గలది ? అవి ఎన్ని భేద షాడవము, ఔడవము, సంపూర్ణము, అని రాగము మూడువిధములు. అవి ఒక్కొక్కటి శుద్ధము,

| | |
|---|---|
| ము లగుచున్నవి ? | ఛాయాలగము, మిశ్రము, అని మూడు భేదము లగుచున్నవి. |
| 22. షాడవ ఔడవ సంపూర్ణ మనఁగల భేదమేమి ? | షాడవము 6 స్వరములును, ఔడవము 5 స్వరములును, సంపూర్ణము 7 స్వరములును గలిగియుండును. |
| 23. సంపూర్ణ స్వరమునందు గలిగిన ఔడవభేదము లెన్ని ? | సంపూర్ణ స్వరమునందు గలిగిన ఔడవభేదములు పదిహేను. |
| 24. ఆరోహణమునందు ఆఱును, అవరోహణములో సప్తస్వరము లుండుదాని పేరేమి ? | ఆరోహణమునందు ఆఱు స్వరములును, అవరోహణమునందు యేడు స్వరములుండినదానిని షాడవ సంపూర్ణ రాగమని పేరు. |
| 25. స్థాయి అనగా నేమి? | షడ్జము మొదలు పైషడ్జమునందుట స్థాయి యనఁబడును. |
| 26. మేళకర్తలనగా నేమి ? అవి యెన్నిగలవు ? | సంపూర్ణస్వరములు గల జనకరాగములకు మేళకర్తలని పేరు. అవి 72 గలవు. |
| 27. డెబ్బదిరెండు మేళకర్తలకు చక్రములెన్ని ? చక్ర మొక్కొంటికి రాగములెన్ని? | చక్ర మొక్కొంటికి ఆఱేసి రాగముల చొప్పున 72 మేళకర్తలకు 12 చక్రములు గలవు. |
| 28. మాయామాళవ గౌళ ఎన్నవ చక్రములో ఎన్నవ రాగము ? | మాయా మాళవగౌళ అనునది 3-వ చక్రములో 3-వ రాగము. |
| 29. జన్యరాగము లనగా నేమి ? | మేళకర్తల వలన బుట్టిన ఔడవషాడవాది రాగములకు జన్యరాగములని పేరు. |
| 30. మధ్యమము ఎన్ని భేదములు గలది ? | శుద్ధమధ్యమము ప్రతి మధ్యమము, అని రెండు భేదములు గలది. |
| 31 రాగాంగము లెన్ని భేదములు గలవు ? | రాగాంగము, ఉపాంగము, క్రియాంగము, భాషాంగములని నాలుగు భేదములు గలవు. |

32. రాగాంగ మనగా నేమి ? రాగాంగమనగా, సంపూర్ణములైన మేళకర్త రాగములు.

33. ఉపాంగమనగా నేమి ? మేళకర్తలవలన ఔడవ షాడవాది వర్జములచే బుట్టిన రాగములు.

34. క్రియాంగమనగా నేమి ? రాగస్వరములను వక్రముచేయగా బుట్టినరాగములు.

35. దేశాంగమనగా నేమి ? రెండేసి రాగములను గలుపుటవలన బుట్టినరాగములు.

36. రాగస్వరూపము దేనివలన న ఏర్పడుచున్నది ? న్యాసము, అంశము, గ్రహము, అను నీమూటివలన రాగస్వరూపము ఏర్పడుచున్నది.

37. న్యాసము అనగా నేమి ? ఒకొక్క రాగమును ఆలాపించునపుడు సంగతి విన్యాసముయొక్క చివర స్వరముమీద నిలుపుచుండునది న్యాసస్వరం మనంబడును.

38. అంశ స్వరమనగా నేమి? ఆయారాగములలో సంగతి వేసి పాడునపుడు విశేషముగ ఆస్వరము నే మాటిమాటికి ప్రయోగించునది అంశస్వరమనంబడును.

39. గ్రహస్వరమనగా నేమి? రాగము నారంభించు నపుడేమి మధ్యమధ్య సంగతి నారంభించునపుడేమి ఆ స్వరములోనే యారంభించునది గ్రహస్వర మనంబడును.

40. శుద్ధ మధ్యమ మేళకర్తలెన్ని ? ప్రతిమధ్యమ మేళకర్తలెన్ని ? శుద్ధమధ్యమ మేళకర్తలు 36 న, ప్రతిమధ్యమ మేళకర్తలు 36 ను గలవు.

41. ధీర శంకరాభరణ, మేచకళ్యాణి ఈరెంటికి గల భేద మేమి ? ఈ రెండురాగముల కున్ను మధ్యమమునందు మాత్రము భేదముగలదు.

42. మోహన, రేగుప్తికి యే ఈ రెండు రాగములకున్ను రిషభ ధైవతములందు

| | |
|---|---|
| స్వరములయందు భేదము గలదు ? | భేదము గలదు. |
| 43. వికృతిని పొందని శుద్ధస్వరములుగల రాగమెద్ది ? | వికృతి భేదములేని శుద్ధస్వర రాగము మాయామాళవగౌళ. |
| 44. హరి కాంభోజి ఎన్నవ మేళకర్తయైనదిన్ని జెప్పు టెట్లు ? | ఈ రాగముయొక్క మొదటి రెండు వర్ణములలో హ, అనునది యాద్యష్టమునందు 8 వదియు, రి, అనునది 2 వదియు, అగుటచే 28-వ రాగమని జెప్పందగును. |
| 45. తాళశబ్దమునకు వ్యుత్పత్తి ఎట్లు ? అవి ఎన్ని విధములు ? | తలప్రతిష్ఠాయాం అను ధాతువు వలనను, కరతల ద్వయ సంయోగమువలనను, కాలము, క్రియ, మానము అను నీ మూటి చేరికవలనను, ఇన్నివిధముల చేత తాళశబ్దమునకు వ్యుత్పత్తి గలుగు చున్నది. |
| 46. తాళమునకు ప్రాణములెన్ని ? అవి ఎవ్వి ? | తాళమునకు ప్రాణములు పది. అవి కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము అనునవి. |
| 47. ఘాతఅనగా నేమి ? | ఘాతఅనగా, చేతిలో కొట్టెడి దెబ్బకు పేరు. |
| 48. సంయోగ వియోగముననుల భేదమేమి ? | రెండు హస్తములచేత ఘాతవేయుట సంయోగమనంబడును. ఆ రెండు హస్తములు విడదీయుట వియోగ మనంబడును. |
| 49. తాళము ఎన్నివిధములు? | మార్గము, దేశి, అని రెండువిధములు. |
| 50. మార్గతాళములెవ్వి ? దేశీయ తాళము లెవ్వి? | ఈశ్వర ప్రణీతమైనటువంటి చంచత్పుట, చాచత్పుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్టిక, ఉద్ఘట్టములను పంచతాళములు మార్గతాళములు. తదితరములు దేశీయతాళము లనంబడును. |
| 51. తాళమునకు గల జాతులెవ్వి? | చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణము లనునవి తాళ జాతులు. |
| 52. సంకీర్ణజాతి ఎన్నిఅక్షరములు గలది ? | 9 అక్షరములుగలది సంకీర్ణజాతి యనంబడును. |
| 53. మిశ్రజాతి ఎట్లేర్పడినది? | చతురశ్రము, కలసి మిశ్రజాతి అయినది. |
| 54. తాళాంగము లెన్ని ? అవి ఎవ్వి ? | తాళాంగములారు. అవి అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము అనునవి. |

| | |
|---|---|
| 55. జాతిభేదమగునట్టి అంగ మెద్ది? | లఘువుమాత్రమే జాతిభేదమగునట్టి అంగము. |
| 56. అంగమనగా నేమి? | అంగమనగా, తాళసంఖ్యను గుర్తుంచుటకు చిహ్నమయిన సంజ్ఞ అంగమనంబడును. |
| 57. ధ్రువతాళము ఎన్ని అంగములుగలది? | ధ్రువతాళము నాలుగు అంగములు గలది. |
| 58. అనుద్రుతమునకు ఎన్ని పేళ్లుగలవు? | అర్ధచంద్రము, అవ్యక్తము, అనునాసికము, వ్యంజనము, విరామము, అనునవి అనుద్రుతమునకు పేళ్లు. |
| 59. ఏయేఅంగములచేత జంపెతాళమనంబడును? | లఘువు, అనుద్రుతము, ద్రుతము అను నీమూడు అంగములచేత జంపెతాళ మనంబడును. |
| 60. తిశ్రజాతిధ్రువతాళము ఎన్నిఅక్షరములు గలది? | తిశ్రజాతి ధ్రువతాళము 11 అక్షరములు గలది. |
| 61. 1011 ఈ సంజ్ఞగల తాళమునకు పేరేమి? | ఈ అంగసంజ్ఞగలది ధృవతాళ మనంబడును. |
| 62. మాత్రఅనగా నేమి? | లఘువుకే మాత్రఅని పేరు. |
| 63. తాళమార్గము లెన్ని విధములు? | దక్షిణము, వార్త్తికము, చిత్రము, చిత్రతమము, చిత్రతరము, అతిచిత్రము, అని తాళమార్గములు ఆఱువిధములు. |
| 64. మార్గము లనగా నేమి? | తాళాక్షరముయొక్క అక్షరము మొదలు తుదియొక అక్షరమువరకు నడిచెడి కాల దీర్ఘములకు మార్గము లనంబడును. |
| 65. దక్షిణమార్గము ఎన్నిమాత్రలచే నడుచును? | తాళాక్షరముయొక్క ఒక్కొక్క యక్షరమునకు ఎనిమిదేశి మాత్రలు చొప్పున నడచునది దక్షిణ మార్గమనబడును. |
| 66. తాళక్రియలు ఎన్ని విధములు? | మార్గక్రియలని, దేశ్యక్రియలని రెండువిధములు. |
| 67. క్రియలనగా నేమి? | చేతితో వేసెడి అంగసంజ్ఞలకు క్రియలనంబడును. |
| 68. కాకపాదము ఏయేక్రియలచేత వాడవలెను? | సర్పిణి, క్రిష్య, పతాక, పతిత, అను నీనాలుగు నిశ్శబ్దక్రియలచేత వాడవలయును. |

| | |
|---|---|
| 69. అతీత అనాగత గ్రహములకుగల భేదమేమి? | గీతము నడచినపిమ్మట తాళము నడుచునది అతీతమనంబడును. తాళము నడచినపిమ్మట గీతము నడచునది అనాగత మనంబడును. |
| 70. లయ అనగా నేమి? | తాళము నడుమ నడిచెడి కాలము లయ యనంబడును. |
| 71. లయ ఎన్ని విధములు? అందు ద్రుతలయ ఎట్లుండునది? | ద్రుతలయ, మధ్యలయ, విళంబితలయ అని మూడు విధములు. ద్రుతలయ అనగా, ఎంతత్వరగా పాడవగునో అట్లు తాళము వేసికొని పాడుట. |
| 72. మధ్యలయ ఎట్లుండునది? | ద్రుతలయకు రెట్టింపు విళంబముగా తాళము వేసికొని పాడునది మధ్యలయ యనంబడును. |
| 73. విళంబిత లయకుగల భేదమేమి ? | మధ్యలయకంటె రెట్టింపు విళంబముగా తాళము వేసికొని పాడునది విళంబిత లయ యనంబడును. |
| 74. యతియనగా నేమి? | తాళాంగములుండు రీతినిబట్టి ఏర్పడుదానికి యతి యనంబడును. |
| 75. సమయతి యెట్లుండునది? | అనుద్రుత ద్రుత గురుప్లుతములలో ఎవ్వియైనను సరే, సమానజాతీయములగు అంగములు గలది సమయతి యనంబడును. |
| 76. ప్రస్తారమనగా నేమి? | ఒక సంఖ్యగల స్వరమునుగాని, తాళాంగమునుగాని, పైనవ్రాసి ఆసంఖ్యకు సమానమగు నితర స్వరములచే రూపభేదము చేయునది ప్రస్తారమనంబడును- |
| 77. కాలము లెన్ని? ఆఱవ కాలము ఎన్ని అక్షరములచే నడుచును? | కాలములు ఆఱు. ఆఱవకాలము 32 అక్షరములచే నడుచును. |
| 78. ఆవృత్తమనగా నేమి? | తాళముయొక్క సంపూర్తికి ఆవృత్తమని పేరు. |
| 79. తాళోదాత్తమనగా నేమి? | తాళఘాత యేస్వరమువీద బడుచున్నదో అట్టి స్వరమునకు తాళోదాత్తమని పేరు. |
| 80. స్వరోదాత్తమనగా నేమి? | తాళఘాతబడిన స్వరములుతప్ప మరియే స్వరమునైనను అదిమి యుచ్చరించుదానికి స్వరోదాత్తమని పేరు. |

81. జారుఅనగా నేమి? జారుఅనగా, క్రిందనుండి పైకిగాని, పైనుండి క్రిందికిగాని, ఒకస్వరమునుండి మఱికొన్నిస్వరము వఱకు ఈడ్చుట.

82. వలియుటఅనగా నేమి? వలియుట అనగా, ఒకస్వరము మొదలు దాని పైస్వరమువఱకు సాగించుట.

సంగీత ప్రశ్నోత్తరములు
సమాప్తము.



గద్య.

ఇతి శ్రీవేంకట లక్ష్మీనృసింహ వరప్రసాదలబ్ధ సరస సంగీత పాండిత్య
విశేష వైభవ-శ్రీమద్రంగరాజ భట్టార్య సచ్ఛిష్య-జనకజగోత్ర
పవిత్ర- ఉష్మశెట్టి వేంకటరామాఖ్యపౌత్ర-తత్వవిద్యా
విశారద గోవిందస్వామి సుపుత్ర- విద్వజ్జనవిధేయ
వేంకటస్వామి నామధేయ ప్రణీతంబయిన
సంగీతవిద్యా దర్పణ మను
గ్రంథము సర్వము
సంపూర్ణము.

మూడవకూర్పు, 1,500 ప్రతులు.

